Regd. No. M. 3289 విడిప్రతి అణా Regd No. N. 15

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ జూన్ ౨౪ వ తేది ౧౯౩౭ గురువారము అర్ధసం॥ చందా ౩

సంపుటము ౧౨ { త్రూపుబజారు హైద్రాబాదు - దక్కన్. } సంచిక ౧౪

షా. శ. ౧౮౫౯ — శ్రీ ఈశ్వర సం॥ జ్యేష్ఠ బ॥ ౧ గురువారము. — ౧౯ అమర్దాదు ౧౩౪౬ ఫ.

## మైసూరు సంస్థాన పరిశ్రమలలో సామ్యవాద సిద్ధాంతము

గ్రామ పునర్నిర్మాణ కార్యములకు ప్రభుత్వ సహాయము

రాజవంశీయులకగు ఖర్చులు

మైసూరు శాసనసభలో దివానుగారి ఉపన్యాసము

మైసూరు సంస్థానము అభివృద్ధియందును నాగరకతయందును అగ్రగణ్యులని తలచబడుచున్న సంస్థానములలో నొకటి-ఈసంస్థానములో పరిశ్రమల యొక్క అభివృద్ధికి ప్రభుత్వ మెట్లు సహాయము చేయుచున్నదో, సంస్థానములో ఇతర వైద్యవిద్యాదిశాఖ లేవిధముగపనిచేయుచున్నవో ౧౭జూనునాడు మైసూరుసంస్థానపు శాసనసభ యగు అసెంబ్లీలో ౧౯౩౭-౩౮వ సంవత్సరపు ఆదాయవ్యయపు అంచనాపత్రమును ప్రవేశపెట్టుచు దివానుగారిచ్చిన ఉపన్యాసములో తెలియగలవు- ఆ ఉపన్యాసములోని కొన్ని భాగములు మాత్రమిట ఆంధ్ర పత్రిక నుండి లభించినవి ప్రకటింపబడుచున్నవి.

### శాసన సభలో సంస్కరణ

అసెంబ్లీ నియమములలోను, లెజిస్లేటివు కౌన్సిలు నియమములలోను, కొన్నిమార్పులు చేయబడినవి. ఈమార్పులవల్ల పరిపాలన సౌకర్యము హెచ్చగలదు. అనుభవమును బట్టి సంస్కారమునుపొందుటవల్లనే రాజ్యాంగపద్ధతులు క్రమవికాసమునుపొంది ప్రజాభిప్రాయము సరిగా వ్యక్తమగుచుండగలదు.

అనేక ముఖ్యవిషయములలో యీ సభవారికిని సంస్థానాధీశులకును తీవ్రభేదాభిప్రాయములు కలుగుచుండుటలేదు. సంస్థానాధీశు లెప్పుడును ఉత్తమాదర్శలక్ష్యములతో వ్యవహరించుచుండినప్పుడును శాసనసభ్యులు సద్భావముతో తోడ్పడుచుండినప్పుడును అట్టి భేదాభిప్రాయములు కలుగజాలవు.

### ఆర్థికమాంద్యము

ఆర్థికమాంద్యము ఇప్పుడిప్పుడు కొంచెము కొంచెముగా తొలగిపోయి ధరలు పెరుగుచున్నవి. మైసూరుసంస్థానములో శిస్తు బాకీల మొత్తములుతగ్గుచున్నవి. ప్రజలు వెనుకటికంటె యెక్కువసీటివి, ఎక్కువవిద్యుచ్ఛక్తిని వినియోగించుకొనగలుగుచున్నారు. విలాసార్థమైన వస్తుసామగ్రిని ప్రజలు ఎక్కువగా కొనగల్గుచున్నారు-రైల్వేలకును, ఇతరరహదారీ కంపెనీలకును ఆదాయములు హెచ్చినందువల్లను, వ్యాపారపు కంపెనీలఆదాయముమీద వసూలైన పన్నులు హెచ్చుగానుండుటవల్లను, క్రొత్తవ్యాపార పరిశ్రమలు త్వరగా వృద్ధిపొందుచుండుట వల్లను, ఆర్థికమాంద్యము తొలగుచున్నదనియు ప్రజలు వెనుకటికంటె కొంచెము సంపన్నులగుచున్నారనియు విదితమగుచున్నది-

రాష్ట్రములో ప్రజలు ఎంతతక్కువగా విద్యుచ్ఛక్తిని ఉపయోగించెదరో దానినిబట్టి ప్రజల సంపన్నస్థితిని చెప్పవచ్చును. ఈసంవత్సరము ౨౨౪౦లక్షల యూనిట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయబడినట్లయి కాగలదు-అందువల్ల రూ ౭౮ లక్షల ఖర్చుబడియుండును. అంతకంతకువిద్యుచ్ఛక్తిని ఎక్కువగాసప్లయి చేయవలసి వచ్చుచున్నది. విద్యుచ్ఛక్తిశాఖ అంతసప్లయిచేయుటకు ఇబ్బందిపడుచున్నారు-అందువల్ల షింషాజలపాతమువద్ద నూతనవిద్యుత్పత్తికేంద్రమును ఏర్పాటుచేయదలంచిరి ఈ విద్యుత్కేంద్రమును ఏర్పాటుచేయుటకు రూ౬౨ లక్షలఖర్చు మదింపు చేయబడినది- ఈ విద్యుత్కేంద్రము నందు ౧౫,౦౦౦ మొదలు ౧౮,౦౦౦ అశ్వములబలము గలశక్తి యుత్పన్నముకాగలదు- ఈస్కీము పనిచేయుటయున్న గెరుసప్ప జలపాతమువద్ద నుండి విద్యుచ్ఛక్తిని సప్లయిచేయుటయున్న అచిరకాలములోనే జరుగును-

కాని, వ్యవసాయపద్ధతులనువృద్ధిచేసి వారి జీవితమును ఉచ్చదశలోనికి తెచ్చుటకుచేయవలసినసదుపాయముల నింకను చేయలేదు- విద్యావిషయములందును, ప్రజారోగ్య పారిశుద్ధ్యములందును మనము చేయవలసిన సంస్కారాభివృద్ధి చాలకలదు-మధ్యతరగతులు వారినిరుద్యోగబాధపడుచునేయున్నది- కాబట్టి చౌకవడ్డీ రేట్లకు ద్రవ్యములభించుచున్న ఈసమయములో ద్రవ్యమును పెట్టుబడిపెట్టుటకును, కూలిపనులుచేయుటకును జనులు సమృద్ధిగా లభించుచున్న యీసమయములో మనము, తీరికగాకూర్చుండుటకువీలులేదు-ద్రవ్యమును ఖజానాలో నిల్వచేసికొనుచుండుటకు వీలులేదు-ప్రజలసౌకర్యాభివృద్ధికై మనద్రవ్యమును సామర్థ్యమును పూర్తిగా వినియోగించవలసియున్నది-ఈ సంకల్పముతోనే సంస్థానప్రభుత్వము వారు కృషిచేయదలంచియున్నారు.

### ఆదాయ వ్యయముల లెక్క

౧౯౨౬-౨౭ సం॥రములో సంస్థానము యొక్క ఆదాయము రూ౩౩౯ లక్షలు మాత్రమే ౧౯౨౯-౩౦సం॥లో రూ౩౫౪లక్షలవరకుపెరిగి తిరిగి ౩౩౨ లక్షలకుపడిపోయినది- ౧౯౩౫, ౩౬సం-రములో రూ౩౭౯లక్షలవరకు పెరిగినది-౧౯౩౬-౩౭సం॥పు రివైజుడు లెక్కలనుబట్టి ౩౭౯లక్షలవరకు లెక్కతేలినది. కానిరాగల ౧౯౩౭-౩౮సం॥లో ౪౭౬ లక్షలు మాత్రమే ఉండగలవని అంచనావేయడమైనది. ౧౯౨౬, ౨౭సం॥లో ఆదాయముకంటెవ్యయము ౯లక్షలుమాత్రమే హెచ్చుగానుండెను-కాని౧౯౩౫, ౩౬సం-రములో ఖర్చుపోను ఆదాయములో నుండి రూ౨,౫౪,౦౦౦నిల్వతేలెను-తాత్కాలికావసరములకై చేసిన బాకీలను తీర్చియుండనియెడల ఆనిల్వ మొత్తమింకను హెచ్చుగానుండెడిది. ఇప్పుడు౧౯౩౬-౩౭సం॥లో రూ౧,౨౫౦౦౦లు నిల్వ యుండును-రాగల ౧౯౩౭-౩౮సం॥లో రూ ౭౪౦౦౦ మాత్రము నిల్వయుండగలదు-

### ఆదాయ మార్గములు

సంస్థానమునకు లభించెడి ఆదాయము మూడు ముఖ్యమైనవిధారములవల్ల లభించుచున్నది.

(౧) ప్రకృతిసంపత్తి.

(౨) సంస్థానప్రభుత్వము వారి వ్యాపార పరిశ్రమలు-

[౩] ప్రజలపన్నులు.

### బంగారపుగనులు

ప్రకృతి సంపత్తిలో ముఖ్యముగా పేర్కొనదగినది బంగారపుగనుల మూలమున సంస్థానమువారికి వసూలువచ్చెడి కప్పము. ఈబంగారుగనుల వ్యాపారాభివృద్ధికై రెండు క్రొత్త ఏర్పాట్లుజరిగినవి. బంగారుగనులను త్రవ్వెడి క్రొత్త కంపెనీలతో ఖరారునామాలు వ్రాసికొనబడినవి. క్రొత్తగనులున్న ప్రదేశములను కనుగొనుటకై కొందరికి లైసెన్సులీయబడినవి. ఈఏర్పాట్లవల్లను, బంగారువెల హెచ్చుటవల్లను ౧౯౩౫-౩౬ సం॥లో అంచనావేయబడి రాబడికన్న రూ ౧ లక్ష హెచ్చువచ్చెను. ౧౯౩౬-౩౭ సం॥లోకూడా అంచనామొత్తముకన్న రూ ౨,౯౬,౦౦౦ హెచ్చురాబడి యుండగలదు. కాని, క్రొత్తగనులను పరిశోధించువారివల్లరావలసిన బాడుగమొత్తములో రూ ౩౫,౦౦౦ తగ్గెను,

క్రోమియంగనుల వచ్చెడిరాబడి ౧౯౩౫-౩౬ సం॥లో అంచనావేసినదానికంటె రూ ౪౨,౦౦౦ తక్కువవచ్చెను. ౧౯౩౬-౩౭ సం॥లో రూ ౫౦,౦౦౦ అంచనాకంటె హెచ్చువచ్చెను. ౧౯౩౭-౩౮ సం॥లో రూ ౩౦,౦౦౦లకే మదింపువేసితిమి.

### గంధపుపరిశ్రమ

మంచిగంధపుమ్రానులను సంస్థానమువారే వశపరచుకొని యున్నారు. ౧౯౩౫-౩౬ సం॥లో గంధపుమ్రానులవల్లనుండి తీయుపరిమళద్రవ్యములను విక్రయించుటవల్ల అంచనాకంటె రూ ౯౯,౦౦౦ ఎక్కువలభించెను. ౧౯౩౬-౩౭ సం॥లో రూ ౧,౫౫౦౦౦ బడ్జెటుమదింపుకన్న హెచ్చురాగలదు, ౧౯౩౭-౩౮ సం॥లో ౧౯౩౬-౩౭ సం॥లోవలెనే ఆదాయమురాగలదు, మంచిగంధపు తైలాదిద్రవ్యములకు ప్రపంచములో మంచిగిరాకీ ఏర్పడుచున్నది, కనుక ౧౯౩౭-౩౮ సం॥లో ౧,౯౦౦౦౦ పౌనులుమంచిగంధపునూనెను అమ్ముటకు అవకాశముండు. ఆర్థికమాంద్యము ప్రబలుటకుపూర్వము ౧౯౨౯-౩౦ సం॥లోకూడ అంతపరిమితిగల సరకు చలామణియయ్యెను. కాని, యిప్పుడుధరలు తగ్గియుండుటవల్లను, సరకుతయారుచేయుటకు ఖర్చుహెచ్చుటవల్లను ౧౯౩౭-౩౮ సం॥లో రూ ౧౨,౫౯,౦౦౦ మాత్రమే నికరాదాయముగా నుండగలదు. కాని ౧౯౨౯-౩౦ సం॥లో రూ ౨౭,౩౮,౦౦౦ నికరాదాయముండెను. అనగా ౧౯౨౯-౩౦ సం॥లో తయారుచేసినంతమంచిగంధపునూనెనే యీ౧౯౩౭-౩౮ సం॥లో తయారుచేసినప్పటికిని అప్పుడు వచ్చిన నికరలాభములో సగము మాత్రమే యిప్పుడు రాగలదు.

### మూడురకములపరిశ్రమ

మైసూరు సంస్థానమువారు నిర్వహించెడి యంత్రాగారపరిశ్రమలు మూడురకములుగానున్నవి. ప్రజలకందరకును పనికివచ్చెడి ప్రధానమైన పెద్దసంస్థలు ప్రభుత్వము వారిచేతనే నిర్వహింపబడుచున్నవి. అనగా అందువల్లలభించెడిఆదాయమంతయును ప్రజలకు వినియోగించు ఖజానాలోనికే చేరుచున్నది. ఈపద్ధతి సామ్యవాదుల సిద్ధాంతముల కనుగుణముగానున్నది. మైసూరు సంస్థానములోని రైల్వేలున్న విద్యుదుత్పత్తియున్న, వ్యవసాయపు నీటిపారుదల ఏర్పాట్లున్న, బస్తీలలోని నీటిసప్లైలున్న, ఇనుము ఉక్కుఫ్యాక్టరీలును ఇట్టివి. సబ్బుల ఫ్యాక్టరీ ప్రభుత్వముచే నిర్వహింపబడుచున్నది. చక్కెర ఫ్యాక్టరీలో సంస్థానప్రభుత్వము చాలావాటాలను తీసికొనియున్నది; ఇటువంటి ఫ్యాక్టరీలు రెండవవర్గముగా విభజింపదగియున్నవి. కాని మూడవతరగతివాటికి సంస్థానప్రభుత్వము పెట్టుబడిదారుగామాత్రము వ్యవహరించుచున్నది. అనగా ద్రవ్యమును అప్పిచ్చు బ్యాంకువలె పనిచేయుచున్నది. ఆఫ్యాక్టరీనిర్వహణమునందు స్వయముగా అధికారము చలాయించుటలేదు. మైసూరు స్టోన్ వేర్ పైప్సుఅండు పాటరీస్ లిమిటెడ్ అనునది (రాతిగొట్టములు, తూములు, జాడీలువగైరా మట్టిసామానులను చేయు ఫ్యాక్టరీ) పైరీతిగా ప్రభుత్వద్రవ్యసహాయమునుమాత్రము పొందుచున్నది.

### రైల్వేలు

ఇదివరలో యం.యస్.యం. రైల్వేవారిచే యీ మైసూరు సంస్థానమందు నడిపింపబడుచుండిన రైల్వేలను తీసికొనుటకై యివ్వవలసివచ్చిన ౧,౨౦౦,౦౦౦ పౌనులను చెల్లించివేసితిమి. అందువల్ల ౧౯౩౮ జనవరి ౧ తేదీనుండి ఆరైల్వేలైనులను మనమే వశపరచుకొని నడిపించెదము. నాగర్ వైపునకును గెరుసప్పజలపాతమువైపునకును మీటరుగేజిలైనులను వేయుచున్నాము. తాత్కాలికంగా మోటారు బస్సులను అటువైపు నడిపించుచున్నాము. రైల్వేఛార్జిల తగ్గింపులవల్ల రైల్వేఆదాయము హెచ్చినది. ౧౯౩౫-౩౬ సం॥లో అంచనామదింపుకన్న ౪౧లక్ష రైల్వేఆదాయము హెచ్చువచ్చెను. ౧౯౩౬-౩౭ సం॥లోకూడ అంచనాకన్న రూ ౧,౧౧,౦౦౦ హెచ్చుఆదాయము రాగలదు. కాని ౧౯౩౭-౩౮ సం॥లో నికరాదాయము రూ ౧,౩౩,౦౦౦ తగ్గగలదు, కారణమేమనగా, నిర్వహణవ్యయము హెచ్చును. ఈసంస్థానపురైల్వేలకు ప్రభుత్వముపెట్టిన పెట్టుబడి

మొత్తము రూ ౬౨౨,౫౪ లక్షలు, అంతపెట్టుబడికిని ౧౯౩౭-౩౭ సం॥లో నికరాదాయము ౧౭,౪౫ లక్షలుగాగలదు అనగా నూటికిసాలుకు రూ 3 వడ్డీగిట్టును.

## విద్యుదుత్పత్తి

జలపాత విద్యుచ్ఛక్తివల్ల ౧౯౩౫-౩౬ సం॥లో అంచనాకన్న రు ౧,౩౦ లక్షలు హెచ్చుగ వచ్చెను. ౧౯౩౬-౩౭ సం॥లో ౬౦ లక్షలు హెచ్చుగవచ్చెను. గనులమ్యక్రవ్యడీ కంపెనీల వారు ఎక్కువ విద్యుచ్ఛక్తిని తీసికొనుటవల్ల యీఆదాయము వచ్చెను. ౧౯౩౭-౩౮ సం॥లో నికరాదాయము రు ౨,౪౪ లక్షలు హెచ్చుగలదు. గనులకంపెనీలవారి గిరాకీవల్లను, ఆటోమాటిక్ టెలిఫోనుపద్ధతివల్లను; యీహెచ్చుఆదాయము లభింపగలదు. విద్యుచ్ఛక్తిఉత్పత్తి చేయబడుచోట జలాశయములోనినీరు ఇర్విను కాల్వగుండా పొలములకు సప్లయిఅగుచున్నది. కనుక ౧౯౩౭-౩౮ సం॥లో అనీటితీర్వల వసూళ్లవల్ల రు రాబడులు హెచ్చునటులుగాగలదు, కాని కృష్ణరాజసాగరు ఆనేజలాశయమునకు ఉక్కుగొట్టములు శాశ్వతముగా ఏర్పాటుచేయుటకు క్రొత్తఖర్చు తగులబడియగును గనుక నీటితీర్వల హెచ్చువసూలు దానికిసరిపోవును. ౧౯౩౭-౩౮ సం॥లో వసూళ్లు రు ౬౩,౩౯ లక్షలుండును. అనగా ౧౯౩౫-౩౬ సం॥పు వసుబడికంటె ౫ లక్షలు హెచ్చువచ్చును, ౫ సం॥ల క్రిందట వసుబడి రు ౫౧, ౬౬ లక్షలుమాత్రమే.

౧౯౩౭-౩౮ సం॥లో చామరాజ సాగరు కాలువవల్లవచ్చెడిఆదాయము ౧.౨౬ లక్షలుగును. చామరాజసాగరుపక్కనున్న శ్రీ విశ్వేశ్వరయ్య కాలువవక్కన్నును కలిసి మొత్తముఖర్చు రూ ౬౭౪ లక్షలు నికరాదాయము. మొదటిదానికి ౨౦౨౪ లక్షలకు రెండవదానికి ౧.౪౯ లక్షలును లెక్కతేలును. పెట్టుబడి మొత్తంమీద రూ 3 లవడ్డీయున్న రూపాయిలుండునట్లు గిట్టగలవు.

## ఇనుము ఉక్కుఫ్యాక్టరీ

ఈఫ్యాక్టరీకి పెట్టినపెట్టుబడికి ఆశపడినంత లాభంగిట్టుటలేదు. ఇనుము, ఉక్కు విలువలు హెచ్చినప్పటికిని ౧౯౩౬-౩౭ సం॥లో రూ ౩,౧౦ లక్షలలాభంఅంచనావేయబడెను. ప్రథమదశలో యిటువంటిపరిశ్రమనుగల బాధకములే దీనికికారణము. ఈఫ్యాక్టరీకి ౧౯౩౭-౩౮ సంవత్సరములో లాభముకల్పించగలవు. ఈ ౧౯౩౭-౩౮ సం॥లో రూ ౦౹ లక్ష తిరిగిపెట్టుబడిక్రిందఖర్చగును. ఆవిధంగా ఈఫ్యాక్టరీకి మొత్తంపెట్టుబడి రూ ౧౫౬ లక్షలు లెక్కతేలును.

ఇతరపరిశ్రమలు సంపాదనముచే నిర్వహింపబడు ఇతరపరిశ్రమలన్నియు ఒక్కపద్దుక్రింద పరిశీలించదగినవి. ఈఫ్యాక్టరీలలో ముందుగా సబ్బులఫ్యాక్టరీచెప్పదగినది. సబ్బులవ్యాపారంలో పోటీయున్ననుతృప్తికరంగానే పనిచేయుచున్నది.

సెంట్రల్ ఇండస్ట్రియలు వర్క్‌షాపువారు వ్యవసాయపనిముట్లను తయారుచేయుటలో ప్రత్యేకశ్రద్ధవహించి పనిచేసినది. ఈ౧౯౩౬-౩౭ సం. మొదటిపదిమాసములలోను రూ ౭౩౦౦౦ లవరకు యీవర్క్‌షాపుద్వారా తయారైఅమ్మబడెను. రాగులనునూర్చెడి యంత్రమొకటి ఆ మెరికావమూనాప్రకారం తయారుచేయడమైనది, అది తృప్తికరంగాపనిచేయుచున్నది.

ఔషధద్రవ్యములఉత్పత్తిలో ౭౬,౦౦౦ పౌనులవరకు హెచ్చుతయారయ్యెను. మొత్తంసరకు అమ్మకము రూ ౬౬,౦౦౦ లవరకు కలదు. క్రొత్తఔషధద్రవ్యములు కొన్నితయారుచేయబడినవి.

లక్కపనులఫ్యాక్టరీ-లక్కతో తయారుచేయబడురంగులు, వార్నీషులు ఇచట చేయబడి పబ్లికువర్క్సుశాఖలకు రైల్వేలకు సప్లయి చేయబడుచున్నది.

పట్టునేతఫ్యాక్టరీలో యీ ౧౯౩౬-౩౭సం మొదటి ౧౦ మాసాలలోను ౪౩,౦౦౦ గజముల గుడ్డ రూ ౯౦౦౦౦ లకు అమ్మబడెను. కాని ౧౯౩౫-౩౬ సం. లో ౩౯ వేలగజముల గుడ్డ రూ ౧ లక్షకు అమ్మబడెను. ఈసంవత్సరము పట్టువస్త్రములవ్యాపారములో పోటీహెచ్చినది. ఇచటిపట్టునేత చాలాప్రశస్తమైనది. న్యూజీలాండు, ఆస్ట్రేలియా, అమెరికా దేశాలవారుకూడ యీబట్టలుకొనుచున్నారు.

సింగాణీఫ్యాక్టరీలో యీసంవత్సరము రూ ౨౦,౦౦౦ వరకుఅమ్మబడెను. విద్యుచ్ఛక్తిశాఖవార ఇచటతయారైనసరకును ఎక్కువగాకొనుచున్నారు. బ్రిటిషిండియాకు ఇతరసంస్థానములకు గూడ ఇచటతయారైనసరకు సప్లయిచేయబడుచున్నవి.

హిందూస్థాన్ ఎలెక్ట్రిక్ అండు అక్యూములేటర్సు మాన్యుఫాక్చరి నుకంపెనీయొకటి నిర్మింపబడినది. అది మోటారులకు కావలసినబాటరీలను తయారుచేయుచున్నది.

సిమెంటుఫ్యాక్టరీ యా ౯౪ లక్షలతో నిర్మింపబడుచున్నది. అందులో రూ ౩లక్షలు ఈ ౧౯౩౬-౩౭ లో ఖర్చుపెట్టబడెను. మిగిలినమొత్తము ౧౯౩౭-౩౮లో ఖర్చుపెట్టడమగును.

## చక్కెర ఫ్యాక్టరీ

ఈచక్కెరఫ్యాక్టరీ సంస్థానప్రభుత్వమునకు చెందినదికాదు. కాని దానిలోపెద్దవాటాప్రభుత్వానికికలవు. కాగితాలఫ్యాక్టరీ, పొగాకుకంపెనీ, పట్టుఫ్యాక్టరీ, రాతిసామానులు మట్టిపాత్రలఫ్యాక్టరీకూడ అటువంటివే.

చక్కెరఫ్యాక్టరీలో ౧౯౩౬ సంవత్సరములో నూటికి ౧౫కంతు వాటాలాభము పంచిపెట్టబడెను. అంతకుక్రిందటిసంవత్సరము ౧౧౹౭ మాత్రమే పంచిపెట్టబడెను. ఈఫ్యాక్టరీలాభాలువృద్ధియగుటవల్ల ఆఫ్యాక్టరీచెల్లించే అదాయిపుపన్నువల్ల యీసంస్థానప్రభుత్వానికి హెచ్చురాబడిగాగలదు.

గత 3 సంవత్సరములలోను రూ ౩౭లక్షల విలువగలచెరకు కొనబడెను. ౧౯౩౬-౩౭ సంవత్సరములలోనే రూ ౨౪౬౧ లక్షల విలువగలచెరకు కొనబడెను. ఈఫ్యాక్టరీలోతయారైనచక్కెర వైవిధ్యించినపన్నువల్లను, ఆఫ్యాక్టరీలో సంస్థానప్రభుత్వమునకుగల వాటాలకు పంచియివ్వబడినలాభమువల్లను వరకు రు ౧౧.౨౦ లక్షలు వసూలుబడివచ్చినది.

మైసూరుపొగాకుకంపెనీలోని వాటాలలో నిషధవంతు యీసంస్థాన ప్రభుత్వమువారిదే. అనగా రూ ౧ లక్ష విలువగలవాటాలను తీసికొనియున్నారు.

మైసూరుప్రభుత్వమువారు గత రెండుసంవత్సరములనుండియు మైసూరురాష్ట్రంలో పొగాకుపంటను వృద్ధిచేయుచున్నారు- అందుకు సహాకారిగా 'ఈపొగాకుకంపెనీ ఏర్పాటుచేయబడినది- ఈకంపెనీ చెయిర్మనున్ను, ఇద్దరు డైరెక్టరులను సంస్థానప్రభుత్వముచేతనే నియమింపబడుదురు- పారిశ్రామికశాఖఇంజనీరుఈకంపెనీకి తోడ్పడిపనిచేయుచున్నారు. రాతిసామానులు, మట్టిపాత్రలుతయారుచేయు ఫ్యాక్టరీలను- భారతదేశములోగల ఇటువంటిఫ్యాక్టరీలలో ఇదిమాదిరిది-

## నష్టపడు వ్యాపారములు

కొన్ని వ్యాపారపుకంపెనీలకు ప్రభుత్వమువారుబ్యాంకర్లుగానుండిపెట్టుబడిపెట్టుచున్నారు- అట్టిపెట్టుబడిలో కొన్నిపాతబాకీలుగానగుచున్నవి- అట్టిబాకీలు ౧౯౩౬-౩౭ సంవత్సరములో రూ ౨౭,౪౭ లు లెక్కతేలెను- తీర్థహళ్లి, పెంకులఫ్యాక్టరీ, ప్రెమియరు షోటలుఫ్యాక్టరీ ముఖ్యముగువానికివ్వబడినఋణములివి- శ్రీకృష్ణరాజేంద్రమిల్సులను నేతఫ్యాక్టరీకికూడ ప్రభుత్వమువారు చాలాధనము పెట్టుబడిగాయిచ్చిరి- ఈమిల్లు ఇటీవలనష్టపడినది- కాని నేతషెడ్డుఒకటి క్రొత్తగానిర్మింపబడినది. నాలుగుమాసాలలో బట్టలనేత సాగింపబడును- అప్పుడే మిల్లు లాభసాటిగాపనిచేయును,

## పన్నులు

భూమిశిస్తులవల్ల ౧౯౩౬-౩౭ సం॥లోరూ ౧౨౫,౧౧లక్షలు లెక్కతేలును.౧౯౩౭-౩౮ సం॥లో రూ౧౨౨౬౧ లక్షలుండునని అంచనావేయబడెను.

అబ్కారీవిన్యూ గత కొలదిసంవత్సరములనుండియు క్షీణిస్తున్నది ౧౯౩౫-౩౬ సం॥లో కల్లుపారాయకొలాలవల్ల రెవిన్యూ రూ౪౯,౨౪ లక్షలు ౧౯౩౬-౩౭ సం॥ లో రూ౪౩,౨౩లక్షలు ౧౯౩౭-౩౮ సం॥లో రూ ౪౩,౧౨ లక్షలుండగలదు.

ఈవిధంగా కల్లుసారాలవల్ల వసూలుబడితగ్గినందువల్ల ప్రజలలోమద్యపానము తగ్గుచుండినదని దల నేమసంతోషింపగలము. కాని, అబ్కారీచట్టముమతిక్రమించి దొంగతనముగా కల్లుసారా అమ్మిక్రయము జరుగుచున్నట్లువిదితమగుచున్నది.

ఆదాయపుపన్నువల్ల ౧౯౩౫-౩౬ సం॥లో రూ౨౩-౪౪ లక్షలున్ను ౧౯౩౬-౩౭సం॥లో రూ౨౧.౭౩ లక్షలున్నవచ్చెను.

ఇతరచిల్లరపన్నులు ఏవనగా.చక్కెరపన్ను, నిప్పుపెట్టెలపన్ను, జూదము లాటరీవ్యాపారంమీదపన్ను, అయియున్నవి. చక్కెరపన్ను హెచ్చినందువల్ల యీ౧౯౩౭-౩౮ సం॥లో ఆ పన్నుఆదాయము హెచ్చగలదు. జూదాలు లాటరీలమీద హెచ్చగలదు.

ఈయూనుపన్నులవల్ల రూ౧౦-౯౭ లక్షలు ౧౯౩౬-౩౭ సం॥లో లెక్కతేలును ౧౯౩౭-౩౮సం॥లో రూ౧౩-౩౭ లక్షలు లెక్కతేల వచ్చును.

## రాజవంశీయుల ఖర్చులు

ఖర్చుపద్దులక్రింద కొన్నిమార్పులు చేయబడెను. మహారాజాగారు ౧౯౩౬-౩౭ సంవత్సరములలో యూరోపునందు పర్యటనముచేసిరి. అఖర్చుక్రింద పబ్లికుఖజానానుండి రూ ౨౧లక్షలు సంజూరుచేయబడెను. ౧౯౩౫-౩౬ సం॥లలో రాకుమార్తె చెలువజమ్మన్నియ వరమరణించెను.అందువల్ల రాజకుటుంబములో చేరిన ఆమెకివ్వవలసిన రూ౭౦.౦౦౦లు నిలచిపోయెను. కానియీ మొత్తంలోనుండి ఆమె కుమార్తెలకిద్దరికిని రూ౫౦౦౦౦లుయివ్వబడినవి, ౩౦౦౦౦ మాత్రముఖర్చుగాక నిలిచియున్నవి జయచామరాజవొడయర్ గారికి వచ్చేసంవత్సరము యుక్తవయస్సువచ్చును. అందువల్ల ఆయనకొకస్వంతసిబ్బంది యుండవలసివచ్చును. అందువలన ఆయనకును ఆయన కుటుంబమునకును పాలీవా రూ౩౬,౦౦౦మంజూరు చేయవలెను- ఆయనముగ్గురుతో బుట్టువులకును ఒక్కొక్కరికి ౨౪౦౦౦౦లకు వారికివివాహమై ప్రాయముగాని యుక్తవయస్సుగాని వచ్చినప్పటినుండి యు మంజూరుచేయవలెను.

## శాఖల వ్యయకర్తనము

ఆయాశాఖలకయ్యెడిఖర్చులు చాలవరకు తగ్గింపబడెనుకాని, ఆర్థికపరిస్థితులు బాగుపడుచున్నవిగనుక ఖర్చును అంతతీవముగా తగ్గింపవలసినఅవసరములేదు.

## నిర్మాణములు

బెంగుళూరుజిల్లాలోని మార్కొండేచెర్వు కోలారుజిల్లాలోని రామసముద్రముచెర్వు, తుంకూరుజిల్లాలోని నిడవలచెర్వుపూర్తియైనవి దీనివల్ల ౨౧౧౪ యకరములుసాగుకాగలవు.తంబాడేచెర్వుఅనకట్ట కుద్దూరుచెర్వు అనకట్టవగైరా నిర్మింపబడుచున్నవి. దీనివల్ల ౬౫౦యకరములుసాగుకాగలవు.

మార్కొనహళ్లివద్ద షిమోగలు తాలూకాలో ఒకజలాశయమును నిర్మించుటకు రూ౨౨ లక్షలుమంజూరు చేయబడెను. ఈమొత్తం౫సం॥ లలో క్రమేణ ఖర్చుపెట్టబడును. ఈ ౧౯౩౬-౩౭సం॥లో రూ౩౦,౦౦౦ ఖర్చుపెట్టడమగును.వచ్చేసం॥ రూ౫లక్షలు ఖర్చుఅగును. రామనాథపురమువద్ద కావేరీమీద రూ౨౭౨ లక్షల ఖర్చుతోనొకవంతెన నిర్మింపబడుచున్నది.

## రోడ్డు ఫండు

రోడ్డుఫండుఒకటి ౨ఏండ్లక్రింద ఏర్పాటుచేయబడి ట్రాఫిక్కుబోర్డువారిచే యిదినిర్వహింపబడెను. ౧౯౩౬-౩౭ సం॥లో యీ ఫండుమొత్తము రూ౨౧-౩౭ లక్షలైనది.దీనిలో ఇండియాప్రభుత్వమువారును మైసూరువారును యిచ్చిన మొత్తములు చేరియున్నవి.

౧౯౩౭-౩౮లోయీ మొత్తమురూ౧౭-౬౪ లక్షలగును. అందులో రూ ౧౪లక్షలు రోడ్లకొరకై ఖర్చుపెట్టబడును. ఇర్విను కాల్వప్రాంతంలోని గ్రామాలలోనిరోడ్లు బాగుచేయుటకై రూ ౫౦,౦౦౦లు ఖర్చుపెట్టబడెను. ఈ ౧౯౩౬-౩౭ సం॥లో రోడ్లఫండుకై అదనముగా గ్రాంటుచేయబడిన ౧౦౩౭ లక్షలలోనుండి ఆమొత్తముఖర్చుపెట్టబడును.

## గ్రామ పునర్నిర్మాణము

గ్రామపునర్నిర్మాణాభివృద్ధికొరకై రెండుపథకములుసంకల్పింపబడినవి.మంచినీటిబావులు యీ సం॥లో రూ౧,౭౭,౦౦లను, గతసంవత్సరం రూ౧,౭౫,౦౦౦లును, రాబోవుసంవత్సరమునకు రూ౩-౦౩లక్షలు మంజూరుచేయుట మైనది.స్థానికసంస్థలుకూడయిందుకై తోడ్పాటుగా మరికొంతద్రవ్యమును సమకూర్చవలెను.

క్లోసేపేటవద్ద గ్రామారోగ్యకేంద్రస్థానమొకటి ఏర్పాటుచేయబడినది, రాకెఫెల్లరు అను అమెరికాకోటీశ్వరుని ధర్మాదాయనిధికూడ దీనిని నిర్వహించుటకు తోడ్పడుచున్నది. గ్రామారోగ్యవిషయములగూర్చి ఆరోగ్యశాఖలోని కొపనులకు ఇచట శిక్షణమొసంగబడును ఈ ఆరోగ్యకేంద్రము గ్రామపునర్నిర్మాణమునకు సంబంధించిన యితరవిషయములలోకూడ శ్రద్ధవహించును వ్యవసాయశాఖవారు సహకారశాఖవారు పారిశ్రామికశాఖవారు పశువైద్యశాఖవారును యీకేంద్రమునకు సహాయముచేసియున్నారు. ౧౩౫గ్రామాలను ప్రత్యేకంగా ఏరితిమి. అందులో ౬౯ గ్రామములను పరిశీలించి లెక్కవివరములు తయారుచేసిరి. ఈగ్రామాలు ఆకేంద్రముచుట్టుప్రక్కలనున్నవి. ౧౩౭ పబ్లికు బావులలోను ౧౨౭౩ ప్రైవేటు బావులలోను క్లోరీనుఅనే క్రిమిహారద్రవ్యము కలుపబడెను- ఈకేంద్రమువారుజరిపిన ప్రచారంవల్ల గ్రామాలలోనియిండ్లు ఎక్కువసౌకర్యములతోశుచిగా ఉంటున్నవి-

ఫలవృక్షముల పెంపకమునుగూర్చి పరిశోధనచేయుటకు హెస్సరఘట్టవద్ద రు ౬౨,౦౦౦లు ఖర్చుచేయ సంకల్పింపబడెను. అందుకు సామ్రాజ్యవ్యవసాయ పరిశోధకమండలి సాయముచేయును. ఇండియా ప్రభుత్వమువారుకూడ మరొక రు ౪౬,౦౦౦లు యీమందిరనిర్మాణముప కీయదలంచిరి. ఇటువంటిదే అంజూరిఫలములతోటలకై గంజాములో ఏర్పాటుచేయదలచిరి, తేనెతుట్టలను పెంచు ఒక్కొక్క కేంద్రములో ౨౫ తుట్టెలుకలవు. శ్రీరంగపట్నములాలుబాగు, హెచ్చులఫారం, ముడిగిరి, బెలహొన్నరు కాఫీతోట బబ్బూరుఫారము ఈఐదుకేంద్రములున్నవి. పెట్టలను, పుంజాలను పెంచుట వృద్ధియగుచున్నవి, వాటికితగిలే అంటువ్యాధులను నివారించుమార్గములను పరిశోధించుటకొకఏర్పాటు అంగీకరించబడినది.

పట్టుపురుగులనుపెంచి దారముతీయుటలో, పట్టుపురుగులగుడ్లను శీతలపేటికలలో భద్రపరచుటకు పరిశోధన జరుగుచున్నది. ఇండియాప్రభుత్వమువారుకూడ దీనికి ధనమిచ్చిరి. పట్టుపురుగులలో వ్యాధులుకలుగకుండ మేలుజాతిపురుగులను తయారుచేయుటకు కృషిజరుగుచున్నది.

## విద్యాభివృద్ధికి

విద్యాశాఖకు ౧౯౩౫-౩౬ సం॥లో ౪౪,౭౯ లక్షలును ౧౯౩౬-౩౭ సం॥లో ౫౨,౫౬ లక్షలును ౧౯౩౭-౩౮ సం॥కు ౫౨,౨౨ లక్షలులు ఖర్చులెక్క వేయబడినవి- ప్రాథమిక విద్యను వృద్ధిచేయుటకు రు ౧౦,౦౦౦ను, వ్యవసాయవిద్య తరగతులను ఏర్పాటుచేయుటకు రు ౫,౦౦౦లును క్రొత్తమాధ్యమిక పాఠశాలలను రు ౧౦,౦౦౦లు మంజూరుచేయవలసియున్నది- క్రొత్తమాధ్యమిక పాఠశాలల భవననిర్మాణమునకు రు ౧ లక్షఖర్చు ప్రత్యేకింపబడినది-

## వైద్యశాఖ

క్రొత్తగా ఆస్పత్రులను పెక్కింటిని నిర్మించుటకు అనగా క్రొత్త కోలారుజిల్లాబోర్డు ఆస్పత్రి, వాణీవిలాస ఆస్పత్రికి అనుబంధముగా శిశువైద్యశాఖయును, బెంగుళూరులోని ఉన్మాదవైద్యశాలకును పూనుకొనడమైనది-

౩ వ పేజీ చూడుడు

## జాబులు

## ఆంధ్ర స్వరాజ్యపార్టీ
### బెజవాడ

### "అంగీరసు"ని దూషణలకు సమాధానము

అయ్యా,

తమ ౧౧-౬-౧౯౩౭ తేదీపత్రికలో "ఇష్టాగోష్ఠి" యను శీర్షికక్రింద "అంగీరసుడు" మద్రాసు రాజకీయములనుగూర్చి వ్రాస్తూ కాంగ్రెసేతర పార్టీలగు జస్టిస్ పీపిల్సు పార్టీలు యేకముగా నూచనలున్నట్లును, యీనూతన రాజకీయ యత్నమునకు "నేషనల్ పార్టీ" యని పేరురావచ్చునన్నట్లును వ్రాస్తూ యీ పాత పార్టీలగురించియు క్రొత్త పార్టీలగురించియూ మనుష్యులగురించియు అనవసర, అసందర్భ, అసత్యప్రశంస కొంతసాగించినారు. ఈవిషయమై యీ క్రిందిఅంశములు తమ పత్రికాముఖమున తెల్లడిపరుప గోరినాను.

"జస్టిస్" "పీపిల్సు" పార్టీలకు సంబంధించినదూషణలతో మాకేమియునిమిత్తములేదుకాని "జస్టిస్" పార్టీపేరు "అంగీరసుడు" చెప్పినట్లు "పూర్తిగాతుడిచివేయు"దురనుట వట్టి అబద్ధమని శ్రీబొబ్బిలిరాజాగారి ప్రచారణ "అంగీరసు"డేల కప్పిపెట్టవలెనో తెలియుటలేదు.

ఇకమాపార్టీగురించి "స్వరాజ్యపార్టీ" పేరుపెట్టుటచే ప్రజలవాక్రించి మాయచేయవచ్చునని "ఎవరోసూచించినట్లున్నది-ఆలోచిస్తే ఆంధ్రస్వరాజ్య పార్టీకిచెందినవారా సూడుపుతాణిలో నున్నారాయని తోచకమానద"ని "అంగీరసుడు" వ్రాసెను. వెన్వెంటనె యీ నూతనపక్షవారు కాంగ్రెస్‌నుతీవ్రముగ నెదిరించెదరనియు, "ప్రభుత్వమునకు జోహారుచేయుచు] నూతనసంస్కరణములు అమలులోబెట్టుటకు యత్నింతురట" యనియు "అంగీరసు"ని జోస్యము, "యనినివేయుట," "మాయ" "గూడుపుఠాణి," "జోహారు" యీమాటలు "అంగీరసు"ని కాంగ్రెస్ పక్షపాతబుద్ధిని, రాజకీయములందు హ్రస్వదృష్టినిచూపుచున్నవేగాని సత్యమునకును రాజకీయసామరస్యమునకు యివి దూరముగనున్నవని నాయభిప్రాయము.

అసలు యీనూతనపార్టీవారి యాయశయములేవో, వాటిగూర్చిన లక్ష్యలక్షణము లెట్టివో ఎవరెవరీపార్టీగూర్చి యాజించుచున్నారో వారినూతన రాజకీయప్రణాళికయేమో, నామకరణమెట్టిదో యనువిషయములనుగూర్చి ఆంధ్రస్వరాజ్యపార్టీలో "అంగీరసు"న కింతయూ గ్యాహేతుక నేమగాని మరియెవ్వరుగానియెరుంగము. అట్టితరి అనవసర ఆలోచనలకుదిగి యీవిధముగా మన్మథగాని, యీ నూతనపార్టీనిగాని, సంగతిసందర్భములను పూర్తిగగ్రహించకయే మీపోటిగౌరవపత్రికద్వారా సోదరాంధ్రులయెడ వ్యాపరచయత్నించుట "అంగీరసు"లకు న్యాయమనితోచినను మీరైననుకొంచెము ఉదారబుద్ధితో విచారించవలయునని ప్రార్థించుచున్నాను— పుట్టనిపార్టీయొక్క నామకరణముగూర్చి విచారించి, ఉన్న పార్టీలను, వచ్చేపార్టీలను దూషించుట "అంగీరసు"మా? లేక కంసత్వమా? కంసుడైనను పుట్టినశిశువు నేవధించెనుగాని యిప్పటి "అంగీరసు"లు కొలగర్భముననున్న శిశువులనే హత్యజేయబూనుటను యేమనదగును?

వాదనకొరకు కాంగ్రెస్ ప్రతిపక్షులగు రాజకీయ పార్టీలు—పీపిల్సు, జస్టిస్, స్వరాజ్య—ఒకకేంద్రీకరణమునకు యత్నించి, నేషనల్ పార్టీయనిమో, లేకతుదకు స్వరాజ్యపార్టీయనియో పేరుతో ఒకనూతన రాజకీయ యత్నమగుట చేసినచో, అందుతప్పేమున్నది! ఈ పార్టీలవారు రాజకీయ యత్నములనుండి విరమింపవలెనని "అంగీరసు"ని ఆశయమా? లేక విన్నతికేరకును కాంగ్రెస్ నెగ్గి, పలువోట్ల యెన్నికలలో నోడినంతమాత్రాన యీపార్టీల నాయకులను కాంగ్రెస్‌లో చేరవలెననియా? అట్లుచేరందరను ఒకేతాటిమీదకు తెచ్చుటకు [మహామ్మదీయులను చేర్చుకొనుటకు ప్రయత్నములుజరుగుచున్నట్లు] కాంగ్రెసువారేమైన ప్రయత్నములుచేయుచున్నారా? వీరేనా కాంగ్రెస్‌వారిని యెదిర్చినది? కాంగ్రెస్‌వారు వీరందరనెదిర్చలేదా? ఒకసారియోడుటచే యెవరిధర్మమునువారు యికవదలవలెనివదేనా? అట్లైనచో ౧౯౩౧-౧౯౩౦ లలో కాంగ్రెస్‌వారు గవర్నమెంటుతో పోరయోడినప్పుడు తమయత్నములను వదలుకొనిరా? ఒకవేళ అందరును కాంగ్రెస్‌లో కలియవలయుననుట "అంగీరసు"కోరికయగుచో యిట్టిఅవకతవక వ్రాతలు ఆయాశయమునకు భంగకరములుకావా? అసలు "అంగీరసుడు" కాంగ్రెస్ సభ్యుడేనా? అన్న విషయములు ఆలోచనకువచ్చును.

ఈనూతనపార్టీ "ప్రభుత్వమునకు జోహారుచేయు"నని "అంగీరసుడు" వ్రాసెను. వీరికీవిషయ మెవరుచెప్పిరి? మదరాస్ పత్రికలలోగాని, ఉదకమండల వార్తలలోగాని, తుదకు రాజకీయస్థితులందుగాని యీనూతనపార్టీ అప్యలక్షణము లెట్టివోయింకను బహిర్గతముకాలేదే! ఈవిషయము తామైనను తెలుసుకొనయత్నించక నే కేవలము ఊహాప్రపంచమునుండి మీపాఠకులను మన్యపరచి, మా ఆంధ్రస్వరాజ్య పార్టీవారినిగాని, లేక నూత్నరాజకీయకక్షనుగాని యిప్పటినుండియు చెడపదలచుట "అంగీరసు"నకు గౌరవప్రదముకానేరదని మనవిచేయుచున్నాను.

ఇట్లు విన్నవించు

బెజవాడ ౧౪-౬-౧౯౩౭ } గుమ్మిడిదల వెంకట సుబ్బారావు కార్యదర్శి.

---

౬ వ పేజీ తరువాయి

### అప్పులు

గత ౧౦ సం॥ల నుండియు ఖర్చుతగిన ఆదాయము చేకూరకపోవుటవల్ల అనేకయిబ్బందులు పడవలసివచ్చెను—కొన్ని ఇప్పటికిని సర్కారుజాస్తి విలువకంటె అప్పువిలువ రు౧౫కోట్లు తగ్గియున్నది— ఈవ్యత్యాసమింకను హెచ్చుచుచేయున్నది— అనగా అప్పుతగ్గి ఆస్తిహెచ్చుచున్నది— ఇకముందు ప్రతిపనికిని నగదు చేతిలో పెట్టుకొని పని చేయదలంచితిమి— అందుకై ఒక సృచలు రిజర్వునిధిను ఏర్పాటుచేయదలంచినాము—

మైసూరు సంస్థానము ఏటేట బ్రిటిషువారికి చెల్లించుచుండిన రు ౨౪౫ లక్షలను చెల్లింపవలసిన అగత్యములేదని రాజప్రతినిధిగారు ప్రకటింపగల దినమునకై ఎదురుచూచుచున్నాము— మైసూరు సంస్థానప్రజలకై వినియోగపడవలసిన ఆద్రవ్యము బ్రిటిషుయిండియా ప్రజలకు ప్రస్తుతము వినియోగపడుచున్నది—

---

# తెలంగాణా వార్తలు

## విద్యాసౌకర్యముల వృద్ధికై విద్యాధికారులకు మొఱ

ఫలితము ఎంతటికిని తేలనందుకు గ్రామస్థులవిచారము

[విలేఖరి]

[illegible]: ౧౨-౬-౩౭

ఈ గ్రామము కరీంనగరములోని జగిత్యాల తాలూకాలో చేరినది- జనసంఖ్య ౨౪౦౦ ఇక్కడ ఒకటపాల్ఖానకలదు- ఇది శ్రీయుత బట్టు రామయ్యగారి లక్ష్మయ్యగారికృషి ద్రవ్య సహాయములవలననే మొదలు పరీక్షగా ఏర్పరచబడి తర్వాత ముస్తఖిల్ చేయబడెను- ఇక్కడ ఒకధర్మశాలగలదు- దీనినికూడా వారే తమ స్వంతద్రవ్యముచే కట్టించి, ప్రస్తుతమువారే పోషించుచున్నారు-

ఇక్కడ ప్రాథమికపాఠశాలకలదు- కాని ఇంగ్లీషువిద్యాభ్యాసమునకు యేలాటియేర్పాటులు లేక ఇక్కడివిద్యార్థులు చాలయిబ్బందుల పాల్పడుచున్నారు- ఇక్కడికి సమీపమున నాల్గుమైళ్ళదూరమున కోరుట్లలో మాధ్యమిక పాఠశాలకలదు- ఇక్కడివిద్యార్థులు నాల్గవతరగతి వరకుచదివి పైతరగతులకొరకు కోరుట్లకు పోవుదురు- కాని ఇంగ్లీషువిద్యలేకపోవుటవలన కోరుట్లలో ఏదో రెండవ లేక మూడవతరగతుల లో చేర్పబడుదురు- ఇది చాలవిచారకరమగు విషయము- దీనివలన పిల్లలవయస్సునష్టమేకాక వారల బీదతల్లిదండ్రులద్రవ్యనష్టము-

### రోడ్లసౌకర్యము

ఇక్కడికి సమీపమున కోరట్లఅనే గ్రామము కలదు-ఇదిచాల మంచివ్యవహారపుబస్తి, మరియు మోటారుస్టేషన్-ఇదిరాదారికొట్టి ఇక్కడికి పురవాసులు రాత్రింబగళ్ళు పోయివచ్చుచుందురు-ఇక్కడి పైరుపంటలకు కోరుట్లనేబజారుకాని రోడ్డులేనందున రైతులు,కర్షకులు చాల కష్టాలపాల్పడుచున్నారు- ప్రత్యేకముగా వర్షాకాలములో బండ్లదారి కాలిబాటలు బొత్తిగా చెడిపోయి నడచుటకూడ దుర్లభముగావుండును-అప్పుడప్పుడు ఆఫీసర్లుగూడ కోరట్లపైనుంచియే పోరాలసివచ్చుచుందురు-వారికికూడ ఈకష్టాలు అనుభవమే, కాని వారకైన ఈ విషయమును పరిశీలించి మాకష్టాల నివారణచేసేవారలు కారు-ఇదిచాల విచారకరము, ఆశ్చర్యకరమగు విషయము.

### పైరు పంటలు

ఇక్కడ ఈసంవత్సరము పైరుపంటలుచాల తక్కువ-మరియు వడగండ్లవర్షముకూడ సంభవించినది-దీనికితోడు ఈసంవత్సరము అవసరమైన పన్నులు మరియు తావానులు విధించ బడెను. గ్రామస్థరైతులస్థితి చాలఅన్యాయముగానున్నది-సిస్తులచెల్లించుట చాలకష్టముగా నున్నది.

## అమాలివానికి రైల్వేబస్సుప్రయాణికునకువివాదము

(స్వ-వి-)

ఆలేరు, ౧౭-౬-౩౭

నిన్నమధ్యాహ్నము ౧౦ గంటలకు హైదరాబాదునుండి రైల్వేబస్సు ఆలేరునకువచ్చినది-ఒక యునానీ గ్రామవైశ్యుడు తనకుమారుని, ౭ ఏండ్లకుమారుని జనగామకుపంపుచుండెను-వారి వద్ద ఒకమూటుకేసుండెను- అది బస్సుఅమాలివాడులాక్కొని పైనపెట్టెదననెను- కాని వీండ్లుఅంగీకరించక మొగవారలు ఎవరులేనందున, వీరలదగ్గరనే వుండనిమ్మని చెప్పినాడు-కానిఅమాలిమాత్రము అంగీకరించలేదు- కండక్టరుచెప్పినను ఒప్పుకొనక ఆఅమాలి వైశ్యునిమీదకి పోట్లాడబోయెను- తుదకు ఆవైశ్యుడు పోలీసుకుపోదుమని ఇష్టానగా అమాలివాడు వేడుకొనెను-

## మృగశిరకార్తెవర్షములు

(ఒక విలేఖరి)

పెదవంగర, ౧౯-౬-౩౭

ఈ గ్రామము నల్లగొండ జిల్లాలో చేరినది-మృగశిర ప్రవేశము అయినప్పటికిని ఏమాత్రము వేడితగ్గకపోయెను- ఇట్టివేడిమికి జనులలో అల్లకల్లోలముజరిగెను- దీనికన్న మొదట వర్షములు యిక్కడిచుట్టుప్రక్కల చెర్వులు,మరియు కుంటలునిండియుండెను కాని పై ఎండవేడిమికి చెరువులలోనీరంత తగ్గిపోయెను- అందుచే రైతులు భీతినొందిరికాని భగవత్కృపవలన నేటిదివసము అనగా ౧౪-౬-౩౭ సాయంత్రం గొప్పగాలితోకూడుకొనినగొప్పవర్షముకురిసెను ఈవర్షమునుంచి యిదివరలోనుంచి పోయిననీరు మరలవచ్చెను-

## బారుబర్దారీ పట్టీ వసూలు విషయమై అనేక ఫిర్యాదులు

వరంగల్లు పురపాలక సంఘము వారి విచారణ

[స్వకీయవిలేఖరి]

౧౬-౬-౧౯౩౭ ఇ.

వరంగల్లులో బారుబర్దారిపట్టీ వసూలును గురించి అనేకమైనమొరలు ప్రజలనుండి పురపాలకసంఘాధికారులకు చేరుటవలన అమర్నాను నెల ౨౪ తేదివాడు పురపాలకసంఘ సాధారణ సమావేశములో ఆక్షేపణసను గూర్చిఆలోచన జరిగి, విషయపరిష్కారమును గూర్చి విమర్శగా ఆలోచించి కర్తవ్యమునునివేదించుటకై సెలెక్టుకమిటీఒకటి ఏర్పాటుచేయబడెను-ఆకమిటీవారు రెండుమార్లు సమావేశమై ఏనిర్ణయమునకు రాలేకపోయినట్లు తెలియుచున్నది-సెలెక్టుకమిటీవారు ఆలస్యముచేయుదురని భయపడుచు పురపాలకసంఘమువారు రేపు సాధారణసమావేశము జరుపనున్నారు-ఈసమావేశములో విషయమంతయు చర్చించబడును. అసలు ఈపన్నుల వసూలుకు సంబంధించిన శాసనము శాసనసభలో తయారుచేయబడినది, ఏమైతె గలదో అది గాని, దానిననుసరించి మాల్గుజారీవారిచేత తయారుచేయబడినది ఏదైతెగలదో అదిగాని దానిననుసరించి మాల్గుజారీవారిచే తయారుచేయబడిననిబంధనలుగాని స్పష్టార్థములుగలేక చిక్కుపెట్టుచుండుటచే, సెలెక్టుకమిటీవారు త్వరగా నిర్ణయమునకువచ్చుట కష్టమైనటుల తెలియుచున్నది.

# కల్లెడ యజ్ఞభంగము

## దైవము చేసిన చిత్రము

(ఒకవిలేఖరి) నర్సంపేట
(వరంగల్లు తాలూకా)
౨౦-౬-౧౯౩౭

హైద్రాబాదు జీవరక్షజ్ఞాన ప్రచారకమండలి సెక్రెటరీ లాల్ జీ మేఘజీ గారు తారీఖు ౧౩-౬-౩౭ గోలకొండపత్రికలో ప్రకటింపబడిన "అగ్నిష్టోమయజ్ఞము" అను వ్యాసమును చూచి చాలవిచారించిరి-కాని యజ్ఞారంభమునకుపూర్వమే యీవార్త తెలిసియుండినచో సావకాశముతో మండలిప్రచారకపార్టీబయలుదేరి జీవరక్షాజ్ఞానప్రచారము చాలచేయగలిగియుండెడిది-అయినను జంతుబలియగుటకు పూర్వము కల్లెడబోవుద్దేశముతో మండలియొక్క ప్రచారకులు కంభంపాటి సత్యనారాయణమూర్తిగారు ఉపదేశకులు యం. కృష్ణస్వామినాయుడుగారిని, హారమోనియం తబలా, పిడేలు మొదలగువాయిద్యములతో ముగ్గురు భజనపరులను వెంటనిడుకొని కల్లెడబోవుటకు ఆయుత్తమయిరి-ఇంతలో సెక్రెటరీగారి కోరికపైన శ్రీయుతులు శివశ్రేష్టి మా-వెం-భాగ్యరెడ్డి వర్మగారు ఇద్దరుఘనసెట్టు వాయిద్యముతో వచ్చి మండలిపార్టీతో ప్రయాణముసాగించి తమకు యీమండలియందుగల పూర్వపు అభిమానమును కనబరచిరి-స్వంతమోటారులారీలో మొత్తం ౯గురితోగూడిన మండలియొక్క-పార్టీ తారీఖు ౧౮-౬-౩౭ నాటి మధ్యాహ్నము హైద్రాబాదుపట్నము విడచినది, పార్టీవారు యజ్ఞపతినిధులై యజ్ఞముచేయుచున్న శ్రీయుత యర్రమల్లి వెంకటేశ్వరరావుగారిని, తదితరులను యజ్ఞమునుపేరుగ విరుద్ధమైనకార్యము అనగా పశుబలిగాకుండునట్లు ముగించుటకు వేడుటకైకుతూహలముగలవారై, యజ్ఞస్థానమును త్వరలోజేరి జీవబలిసాగలేదనువార్త వినుటకై యిందుఆదుర్దాగలవారై దైవసహాయ్యము నపేక్షించుచూ భువనగిరి రాత్రి౯గంటలకుచేరిరి. అక్కడభోజనములచేసివృత్తిజెంది పూర్వపురాత్రివర్షాపాతముచే చెడిపోయినరాజమార్గమున అర్ధరాత్రి కగుసరికి వరంగల్లుధర్మశాల చేరగలిగిరి. జీవహింసకలుగునన భీతిచేత తాతహాపడు యీపార్టీవారిమనస్సు నెమ్మెదిపరచుటకో యన్నట్లు అక్కడనెబోవునవర్షము కురవసాగెను-కాని వర్షబంకముచేత లారీముందుకుపోజాలకపోయెను-పార్టీవారికి అదుర్దా మరింత హెచ్చెను.వరంగల్లులోనిప్రజలు కొంతమందిని కల్లెడకు లారీపోవుట సాధ్యముకాదనియు, వర్షమువలన దారిచెడిపోయినదని చెప్పి నెక్కొండవరకు నిరాటంకముగా మోటారునడచునని సలహాయిచ్చిరి- తదనుసారముగా దాటిరాత్రి ధర్మశాలలోనడిపి తెండవరోజునవారుఉదయం భోజనముచేసిపదిగంటలకుబయలుదేరి దారివెంట జీవరక్షాజ్ఞాన సాహిత్యముపరచుకొనుచూ మధ్యాహ్నము రెండుగంటలవరకు నెక్కొండస్టేషను చేరుకొనిరి.

వాకబుచేయగా కల్లెడగ్రామము నెక్కొండస్టేషనుకు ౧౦మైళ్ళదూరమం దున్నదనియు, గతవర్షముచేత చేలదారిగుతుకులు, గోతులచే మోటారుబోవుటకేమాత్రము వీలుగాదనియు ఎడ్లబండ్లె బహుకష్టముతో పగలంతయునడచి రాత్రికి గ్రామముచేరుచుండునవియు తెలిసినది-ఇంతలోఒకపెద్దమనిషి మోటారులారీ కొద్ది ప్రయాసతో గమస్థానముచేరగలదనియు.తప్పక జీవరక్షార్థమైపొమ్మనియు సలహాయిచ్చుటచే లారీముందునకు సాగినది- కాని డ్రైవరు తనయావత్తు బుద్ధి బలము నుపయోగించియు యీఅగమ్యస్థానముగుండ లారీసాగించజాలకడపోయెను-నెక్కొండగ్రామమధ్యమునే లారీబురదలోచిక్కుకొనెను అప్పుడు ప్రయాణికులుదిగి ఏకబలమునలారీనిబురదనుండి పైకి లాగగా భాగ్యరెడ్డిగారిసలహాపయిన వారితోకల్లెడప్రయాణము ఆపబడెను- ముసాఫరీబంగ్లా నెక్కొండగ్రామము పెద్దది సుమారు౫00ఇండ్లుగలవుఆమీను [పోలీసు] కచేరిట పాఠశాల ఆడవులశాఖాఇన్స్పెక్టరుకచేరిగలవుమహమ్మదీయులుకొద్దిమందిగలరు కల్లుసారావిక్రయము గూడగలదుదినమునకుసుమారు 10మూపాయల ఆదాయమున్నట్లు కల్లంగడియజమానిచెప్పెను-కల్లు అమ్మకటపు తాటిచెట్లు, యీతచెట్లు గలవారికందరికి హక్కు-గలదని గూడతెలిసినది.

గత్యంతరములేక జీవరక్షాజ్ఞాన ప్రచారపార్టీ వారు వాటిరాత్రి [౧౮-౬-౩౭] నెక్కొండగ్రామమున జీవదయాప్రచారసభజేసి గ్రామస్థులకు జీవదయనుగురించి బోధించుచూ చదువుకొన్న కొద్దిమందికి పత్రికలు, పుస్తకములుపంచిపెట్టబడెను. సభలో భాగ్యరెడ్డివర్మగారు గ్రామజనులకు కల్లుసారావలననగు హానినిగురించి బాగుగా తెలియచెప్పిరి. సుమారు ౧౦౦మంది సభకుహాజరైరి-భజనపార్టీవారు జీవదయాభజన లుపాడి ప్రజలనుఆకర్షించిరి. సుమారు రెండు గంటలసేపు సభజరిగెను. రాత్రి ప్రయాణికులు బంగళాలోగడిపిరి- కాని సభ పూర్తిగాకమునుపే యొకశుభవార్త వినవచ్చెను-కల్లెడగ్రామములో యజ్ఞమునకు దైవికముగా లాభము కలిగెననియు, ఆపాదవర్షమేగాక కర్తయొక్క-ధర్మపత్ని మాసికధర్మముచే దూరముగా తొలగవలసివచ్చెననియు, యజ్ఞసంతర్పణమునకు పెరుగుసప్లై చేయుగొల్లడు మరొకగొల్లనిచే చెప్పుచుండగా నిజవార్త వెల్లడైనది-పార్టీవారు తమ మొరను కొంతవరకు దైవము వాలకించెనన్నట్లు సంతోషించిరి-శ్రీభాగ్యరెడ్డి వర్మగారు కొన్ని స్వకార్యాంతరములచేత రాత్రి రైలులో తిరిగి హైద్రాబాదువెళ్లిపోయిరి- ఘనసెట్టివారిద్దరుగూడ అయనను అనుకరించగా మిగిలిన అయిదుగురు గ్రామగ్రామమున జీవరక్షాప్రచారము సాగించ నిశ్చయించుకొని మరునాడు నర్సంపేట చేరిరి.

---

## సిడ్నో-లు వింతలు

సిరసిల్ల 7-9-46

ఇక్కడి సాంఘిక పాఠశాల ప్రధానోపాధ్యాయులగు శ్రీయుత మొహిసీరాయెసాంగడే గారు ఇచ్చటనుండి ఆసిఫాబాదు మిడిలి స్కూలుకు మార్చబడిన సందర్భమున పాఠశాలోపాధ్యాయులు [illegible] ఒక సిడ్నో-లు వింతలు [illegible] ఉపాధ్యాయులను, ఉపాధ్యాయులను గమనింపదగిన విషయములు మున్నగువాటివిషయమై ఉపన్యసించిరి. మూడవవాటి ఉదయమున (7-9-46)వారు వెడలుటకుముందుగా స్కూలువారు వారిని పుష్పమాలాలంకృతులనుగావించి, స్కూలుబ్యాండుతో మోటారువంటెక్కించి గ్రామము దాటువరకును విద్యార్థులును, ఉపాధ్యాయులును వెంబడించి సాగనంపిరి.

---

## మా చందాదారులకు

తమ ఉత్తర ప్రత్యుత్తరములలో చందా నంబరు తెలుపవలెను. లేదేని జవాబు ఇవ్వబడదు. తమ లేఖలు మేనేజరు పేర వ్రాయవలెను.

నో:— చందానంబరు తమకుపంపుపత్రిక పైన వుండును

---

గోలకొండ పత్రిక

ఈశ్వరనామ సం॥ర జ్యేష్ఠ బ॥ ౧

గురువారము

## హైద్రాబాదు మితపాన సంఘానికి కొన్ని సూచనలు

మన రాష్ట్రములో ప్రభుత్వపక్షమున (Temperance association) మితపానసంఘము స్థాపింపబడినదనియు, దాని ప్రధానకార్యకర్తలు నవాబు మిర్జాయార్జంగుబహాదరు గారనియు పాఠకులకు తెలిసియేయుండును. నవాబు గారు మంచిఆవేశముతో కార్యదీక్షతో పనిచేయుచున్నారు. అంతటి శ్రద్ధతో పనిచేయు అధికారిని చూడలేము. అట్టి సర్వప్రాపకము కలిగియు మనరాష్ట్రములో ఎన్నడైన త్రాగుడు బొత్తిగా రూపుమాయునా అను సంశయము కలుగుచున్నది. మా అభిప్రాయమున ఇప్పటిపద్ధతులచే అదెన్నటికిని నశింపదు. ఎందుకనగా కేవలము బోధలచేత మద్యపానములు పోనేపోవు. వాటికి తగిన శాసనములే కావలెను. శాసనములుచేసి ఒకేమారు ఆపివేసిన ప్రభుత్వమునకు ఏటేట ౨ కోట్లకుపైగా నష్టమగును. ఈనష్టమును భరించుటకు ప్రభుత్వము సిద్ధముగానున్నదా! అయినను ఈనష్టమును సరిపెట్టుకొనుటకు కొన్ని యోమార్గములుకలవు. ఆమార్గములను సూచించుచున్నాము-

అమెరికా అనుభవాన్నిబట్టి కల్లుసారాలలో ప్రభుత్వానికి నష్టమువచ్చినను ఇతరత్రఅగుఖర్చులు తగ్గిపోవును. పోలీసుసిబ్బంది తగ్గించవచ్చును. నేరములలో నూటికి ౭౦ కిపైగా మత్తునుండే ప్రారంభమగుచున్నవి. మరియు న్యాయస్థానములఖర్చులును తగ్గును. అబ్కారి కచ్చేరీల నౌకరీలజీతాలు అన్నియు మిగిలిపోవును. ఈప్రకారముచూచిన ౨ కోట్లకుబదులు ౧½ కోటియే ప్రభుత్వానికి నష్టముకలుగును.

మరియు జనులఆదాయము హెచ్చును. బ్యాంకులు వృద్ధిపొందును. ప్రభుత్వమువారు ఆదాయము పన్నుద్వారా కొంత రాబట్టుకొనవచ్చును. ఇట్లుచూచిన ఒకకోటివరకే ప్రభుత్వమునకు నష్టముకలుగును.

కాని యిదికూడ భర్తీ చేసికొనవచ్చును. ఈతచెట్లు, తాటిచెట్లు కల్లుకేకాక యితరవిధముల చాల యుపయోగపడును. ఈతబెల్లము తాటిబెల్లము నిత్యవ్యవహారములకు ఉపయోగపడునట్టివే. ఇవి సిద్ధముచేసిన ఏమైనం లాభము కలదో లేదో యీ మితపాన సంఘమువారు పరీక్షింపచేయుట యవసరము. ఇంతేకాక ఈచెట్ల యాకులు, పండ్లు, మొద్దులు, నార,దబ్బలు, అన్నియు పనికివచ్చునట్టివే. ఇవన్నియు వ్యాపారిత్యా యెంతవరకు లాభమో విచారింపవలెను.

ఇప్పటిపరిస్థితులలో మద్రాసు సిస్టమును ఏర్పాటుచేసి మాములాను మరింతబిగింపుచేసి ఆదాయము వృద్ధిపరచుచున్నారు. కేవలము కల్లునే దృష్టియందుంచుకొని ఖానూనుచేయుటవలనమన రైతులకు ఇబ్బందులుకలిగి దినదినము చాలాభూములు వ్యవసాయ యోగ్యముగాకుండ ఉన్నవి. ఈత తాటివిత్తులు భూమిలో మొలచినతర్వాత సామాన్యముగాపోవు. వాటిని కొట్టివేసిన రైతులను పట్టుకొనిపోయి వ్యవహారములు జరిపి జుర్మానాలు వసూలు చేయుదురు. కొట్టక అట్లేయుంచిరా కొన్ని యేండ్లలో పొలమంతయు అవే మొలిచిభూమి వ్యవసాయయోగ్యముగా నుండనేరదు.

రైతులకు త్రాళ్లుకావలసియుండును ఈతనార చాలచౌక కాని అదినా ధారణముగా దొరకదు. ఇండ్లకప్పులకు తాటిదూలములు వెంతెలు చాలచౌక కాని వాటిని తెచ్చుకొనుట ఒక పెద్దవ్యవహారము. కావున నిజముగా మద్యపాన నిర్మూలనముచేయవలెననిన రైతులపట్టా భూములలో ఈదులు, జట్టీములు, త్రాళ్లు మొలకలవ్వుడైనా, తర్వాతైనను కొట్టివేయుటకు రైతులకు సంపూర్ణాధికారముండవలెను. మరియు పైనసూచించిన ప్రకారము ఈచెట్లవలన యితరయుపయోగములను గుర్తించి వాటివలన నెంతలాభముకలుగునో విచారించవలెను.

మొత్తముపై సంపూర్ణనిర్మూలనము కావలెననిన ప్రభుత్వమువారీక్రిందిమార్గములనవలంబించవలెను.

౧. లైసెన్సుపద్ధతిని, మద్రాసుసిస్టమును బైరకులనుఎత్తివేయవలెను.

౨. సర్లమందు, కల్లు, సారా, భంగి స్వదేశీ విదేశీసారా అన్నియు ఎవ్వరును త్రాగకూడదని కఠినముగా శాసించవలెను. మేము ఎరిగినంతవరకు హిందూస్థానమంతటిలో ఒక్క కాశ్మీరురాజ్యములో ఇట్టిశాసనము కావింపబడినది.

౩. దానికి ప్రారంభప్రయత్నముగా మొదలు ప్రతిమాసము మొదటిదినమునాడు Temperance day అఖిలరాష్ట్ర మద్యపాన నిరోధకదినము నేర్పాటుచేయవలెను. ఆనాడు కల్లుగీయుట, అమ్మట, త్రాగుట నిషిద్ధము కావలెను.

జి. నారాయణ కంట్రాక్టరు
సికింద్రాబాదు

వీరు ౧౭-౬-౩౭ తేదీనఆకస్మాత్తుగా కడుపునొప్పిలేచి, ౨౧-౬-౩౭ తేది సాయంత్రము 3 గంటలకు స్వర్గస్థులైరి.

## జాగీరు న్యాయాధికారుల హక్కుల వివరణము

ఒకదివాని అభియోగములో జాగీరున్యాయాధికారుల హక్కులవిషయమై కొన్ని విష్యలు సంభవించి ఉన్నత న్యాయస్థానము వారికి తెలియగా వారిట్లువివరించుచున్నారు:—

"దుమ్బాయిబ్బి క్రయము చేసికొనిన భూములు మరియుమఖ్తాలు జాగీరులో నిభాగముగా తలచి ప్రభుత్వమువారిచే జాగీరుదారులకు యివ్వబడిన న్యాయపరిశీలన హక్కులను వీనిపై ఆ మహక్కులను ఉపయోగించుచున్నారు. కాని (ఆతాయెసుల్తాని)జాగీరుదారులకు యివ్వబడిన న్యాయవిచారణహక్కులు ఆజాగీరునకు మాత్రమే ఉపయోగించుటకు వీలుపడునే కాని క్రయముచేసిన భూములపైగాని, మఖ్తాలపైగాని ఉపయోగించుటకువీలు లేదు. అట్లు క్రయముచేయబడినవి ఆతాయెసుల్తానికి సంబంధించవు దీనివిషయమై ౧౩౪౬ ఫసలి ఆదిబెహిస్తు ౪ వ తేదినాటి ౪౫౧౩ మురాసిలానిషాన్ ద్వారా

౪౫౧౪

జాగీరుదారులు తాము క్రయముచేసిన భూముల పైగాని మఖ్తాలపైగాని న్యాయపరిశీలన హక్కులు ఉపయోగించనీలుపడదనియు, కాని ప్రభుత్వమువారు జాగీరునుండి ఏదైన గ్రామము తీసికొని దానికిబదులుగా యివ్వబడిన గ్రామము పై మాత్రము ఉపయోగించుట సమంజసమనియు ఉత్తరువు చేయబడినది.

### ఆర్థికశాఖ కార్యాలయము మార్పు

మింటు లివరణలోనున్న ప్రభుత్వఆర్థిక శాఖ కార్యాలయము [దఫ్తర్ ఫైనాన్స్] ప్రభుత్వ అబ్కారిశాఖ [నిజామతు అబ్కారి]కు నడిపైపున్న సొంపూర్ వాడి భవనమునకు మార్చబడినది.

## బహుమాన వేతనచట్టము

సదరుమహాసభగారి కార్యాలయమునుండి ౧౩౪౬ ఫసలీలో ౧౨వ తేదినాటిగస్తీనిషాన్ ౩౦ ఈక్రిందివిధమున వెలువడినది:—

౧౩౪౬ ఫస్లిఖుర్దాదు ౨౫ వ తేదినాడు శ్రీ సర్కారుప్రభువుగారి ఫర్మానావలన బహుమానవేతనచట్టము [ఆలీఫు]లో దఫా ౫౫నకు జతులు ఈక్రిందివాక్యములు చేర్పబడినవి:-

"పరిస్థితులననుసరించి అవసర మనిపించిన మరియు కొద్దిఉద్యోగస్థుడు ఉపకార వేతనముపై ఉద్యోగమునుండివిరమించి ౫ సంవత్సరములలోపల కాలము చేసిన అతనికుటుంబీకులకెల్లరకును, ౫సంవత్సరముల తర్వాత కాలము చేసిన అతనిభార్యకుమాత్రము రెండు రూపాయిలు బహుమానవేతనము ఇవ్వబడుచుండును." ఈఉత్తరువు ప్రభువుగారిఆంగీకారము నకు రాగలుగును.

## దొంగ సారా భట్టీలు

హైద్రాబాదు, అమర్దాదు ౧౪:—

పాఖాల్ తాలూకా న్యాయస్థానములో విచారణచేయబడుచున్న దొంగసారాభట్టీల సాలును అభియోగములలో నెంబరు ౩వ అభియోగములోని నిందితుడగు భాట్ రాంజీ లాబాదుకి చారోజులు జైలుశిక్ష రు. ౧౦౦లు జుర్మానా, జుర్మానా చెల్లించనిచో మరి నాలుగురోజులు జైలుశిక్ష నెంబరునాలుగవ అభియోగములోని నిందితుడగు అక్మేరుఅల్లాయ్యకు రెండు నెలల జైలుశిక్ష, రు.౫౦లు జుర్మానా. జుర్మానా చెల్లించనిచో మరిపదిరోజులు జైలుశిక్ష అనుభవించుటకు తీర్మానించబడెను. నెంబరు నాలుగులోని నేరస్థుడు ఇదివరకే నేరస్థుడుగా ప్రభుత్వ పులీసులో కట్టివున్నారే. ఇతనిని అరెస్టు చేయుటకు, అబ్కారిశాఖ సబ్ఇన్స్పెక్టరగు పొర్వీస యుద్దుమహమ్మదు ముహీయుద్దీన్ గారు చాలా కాలమునుండి ప్రయత్నించుచుండిరి.

## ఉద్యోగ విషయములు

రైల్వేశాఖ రిజిస్ట్రార్ అగు శ్రీయుత అయ్యర్ గారి ఉద్యోగకాలములో మరియొకసంవత్సరం పొడిగించిరి.

ముంకపుశాఖ మొహతెమీంఅగు లెఫ్టినెంట్ మీర్ కరీముల్లాఖాన్ గారుఉపకారవేతనము పై పరమించినందున వీరిస్థలమున నాయబ్ మొహతెమీం ప్రస్తుతము ఔరంగాబాదు మహాసూబా మొహతెమీంఅగు మౌల్వీ నవాబు అహమద్ గారిని శాశ్వితపరచిరి. మరియు ప్రస్తుతము నాయబు మొహతెమీం అగు మౌల్వీమతీఉల్లా సబ్ గారిపై వారిస్థానములో నియమించిరి.

శ్రీయుత రాజదేవరావుగారి సపరీక్షా నియమితకాలము ఒకసంవత్సరము తీరిపోయినందున వీరిని వ్యవసాయశాఖ సహాయోపాధ్యాయులుగా శాశ్వితపరచిరి.

సయ్యద్ యుసోఫుగారు ౧౭ జూను గురువారమునాడు ప్రభుత్వ ప్రకటన శాఖాధికారమును క్రొత్తగానియుక్తులైన ప్రొఫెసర్ సాహిబు నరసింహా గారికి అప్పగించి, వారిని శాఖోద్యోగులకు పరిచయము చేసిరి. క్రొత్త అధికారిగారు ఇంతవరకు ఉస్మానియావిద్యాపీఠములో శాస్త్రాత్ర ప్రధానాచార్యులుగనుండిరి. వారు యల్.యల్.బి.మాత్రమేగాక లండనులో బి.యస్సి డిగ్రీకూడగలవారు, యం.ఏ. వారికి క్రొత్తనియామకముజరుగగానే వారు ప్రివేషు యిడియాకుపోయి, అక్కడప్రకటనశాఖ యెట్లుపనిచేయుచుండునో కనుగొనివచ్చిరి.

### రాకపోకలు

ఇంగ్లాండునుండి నవాబుజాల్యదరుయార్జంగు బహద్దరు గారును, బెంగుళూరునుండి నవాబు వహీదుయార్జంగు బహద్దరు గారును అమర్దాదు ౧౬వ తేదీనగరమునకువచ్చిరి.

భూమ్యాదాయశాఖామంత్రియగు సర్.జే. టాస్కరుగారు ఊటీనుండి అమర్దాదు ౧౨వ తేది హైద్రాబాదునకు విచ్చేసిరి.

పూనాకువెళ్లిన ఆర్థికశాఖా మంత్రియగు నవాబుఫఖ్రుయార్జంగు బహద్దరుగారు అమర్దాదు ౧౬వ తేది నగరమునలంకరించిరి

సార్వభౌమునిపట్టాభిషేకమునకు పోలెండుకు సైనికప్రతినిధిగవెళ్లిన కర్నల్ నవాబు ఖాదరుయార్జంగు బహద్దరుగారు అమర్దాదు ౧౨వ తేది పట్టణమునకుచేరిరి.

రాకుమారులును: నగరాధీశ్వరుల్ శాహజాద్యులును ... ఆజంజా బహద్దరుగారు బెంగళూరునుండి అమర్దాదు ౧౬వ తేదినాడు హైద్రాబాదునకు విజయము చేసిరి.

## వ్యాధిగ్రస్తులకు హితవు

[మాడపాటి- హనుమంతరావు గారు]

న్యూమోనియా, బ్రాంకైటిసు, ఇన్ఫ్లుయెంజా అనువ్యాధులకు అమోఘమైనమందును డాక్టరుకబాడ్యా, న్యుమోనియా స్పెషలిస్టు, 7827 రాణిగంజు, సికింద్రాబాదు అనువారు కనిపెట్టినారనియు దానివలన అనేకులకు భయంకరమైన ఆవ్యాధులలో కొన్నిగంటలలో గుణమిచ్చినదనియు, వారిఅనుభవము పొందినవారివలన తెలిసినది-ఇది చాల సంతోషకరమైన విషయము,

ఈవైద్యుడుగారు, ప్రజల ఉపయోగార్థము [౧]పైమూడు వ్యాధులను తమచేతనిపెట్టబడిన ఔషధమువలన తప్పక నయముచేయగలమనియు, [౨] వ్యాధియొక్క ఉధృతము పదిగంటలలో తగ్గించి గుణముకనుపింపచేసెదమనియు [3] గుణము కనిపించకయుండు మందుఖర్చునైన తిరిగి యిచ్చెదమనియు ప్రతిజ్ఞ చేసియున్నారు.

కనుక వ్యాధిగ్రస్తులగువారు వీరివలన ఉపకారముపొంది ఆరోగ్యవంతులగుదురుగాక యనియు, బీదసాదలగువారికి ఉచితముగా చికిత్సయని వైద్యసహాయము అభిలషించుగాక యని యాశించుచున్నాము.

## వైస్రాయిగారి ప్రకటన

వైస్రాయిగారు రాజ్యాంగ ప్రతిష్టంభనము నుగూర్చి ఏమివిశేషము ప్రకటింతురోయని జనులు నోరుతెరచికొనియుండ పోయిన ౨౧ జూను నాటి సాయంకాలము వారిఉపన్యాసము రేడియోద్వారా ప్రకటించబడెను. అందులో తెలిసిన క్రొత్త సారాంశమేదియులేదు. ఇదివరకు సెక్రెటరీఆఫ్‌స్టేటు, గవర్నర్లు చెప్పినవిషయములే సమర్థించబడినవి. ఉపరి ఏమనగానూ తనరాజ్యాంగప్రకారము గవర్నర్లపై గవర్నరుజనరలుకును, వారిపై లండనులో సెక్రెటరీఆఫ్‌స్టేటుకును సామాన్యాధికారముగలదని అక్షరాల చెప్పబడినది. ఇంతకఠిన సందేశమైనను మెత్తటిమాటలలో మిత్రులకుచెప్పునట్లు ఠీయ్యగా చెప్పబడినది.

## వీరలా అంటరానివారు!

కుర్తకోటిస్వామిగారు కాదనుట

బొంబాయి రాష్ట్రీయ చర్మకారమహాసభ పూనాలో ౧౯ జూనునాడు సాయంకాలము ప్రారంభమాయెను. ప్రారంభోత్సవముజరుపుచు కుర్తకోటిస్వామిగారు "నాచుట్టునునున్న ఈహాసన్ముఖులను అంటరానివారలని ఎవరైన చెప్ప సాహసించగలరా? ఆయాఖములలో అస్పృశ్యతచిహ్నమే లేదు. స్వధర్మాభిమానము సేవానిరతులతో ఉప్పొంగుచున్న హృదయములే సూచితమగుచున్నవి." అనిరి. వర్ణ, మత, భాషా, రాష్ట్రభేదములనుమరచి హిందువులందరును ఐకమత్యముతో నుండవలెననిరి.

సభాధ్యక్షుడు కజ్రోల్కరుగా రుపన్యసించుచు "డాక్టర్ అంబేద్కరుగారి మతపరివర్తనోద్యమమందు నాకువిశ్వాసములేదు. దీనివలన అస్పృశ్యతాదోషము తొలగుటగాని, హరిజనులు ఏమతస్థులైనను వారిహోదా హెచ్చుటగాని జరుగదని నాకుతెలియును. కాబట్టి విద్యావ్యాప్తిచేతను, అంతర్భేముల తొలగించుటచేతను ఉచ్చవర్ణస్థులు తగిలించినబంధములను త్రెంపిజేయుటయొకటేమార్గ"మనిరి.

---

## నోటీసు

మహారాజశ్రీ వాసుదేవరావు శేగేదారు కోర్టుఅఫువార్డ్సు సర్కారెఆలీ, మొకాం మహీరాబాదు హైదరాబాదు దక్కన్‌గారికి:—

ఇందువెంట మీకు తెల్యపరచడం యేమనగా నేను సుల్తానుబజారులో నెం (౧౭౨౪) గలయిల్లు. జేకీబాయి జవుజె ఆశారాంవద్ద కొనియుంటిని. అట్టి యిల్లుయొక్క విక్రయపత్రము భద్రాను కూలం మీబంధుత్వముననుసరించి మీ వద్దపెట్టియుంటిని. అట్టిపత్రమును పైజెప్పిన జేకీబాయినద్దకుదునబెట్టి నాయొక్కజాలీసంతకముచేసి నీవు కొన్నిరూపాయలను తీసికొనియున్నావు. కావున ఈ నోటీసుముట్టినమూడురోజులలో మాపత్రము మాకుముట్టచేయవలెను. లేనియెడల నీపైన దివానీ ఫౌజుదారీ నియమింపపడినవిధిప్రకారం కారువాయి సడుపగలము. అప్పుడు యేయేఖర్చులుఅవునో అట్టిఖర్చులునష్టముమీయందువుండగలదు. ఇందులమునన్నా నోటీసుజేకీబాయి జ॥ ఆశారాం మొకాం ముతస్సిల్ మార్కెటు సుల్తానుబజారుకు వ్రాయడంయేమనగా పైవ్రాయబడిన అభిప్రాయమునుబట్టి నీవద్ద నాపేరవుంటబడిన బైనామ దస్తావేజు సదరుముద్దతులో మాకువావసుకానియెడల దివాని ఫౌజుదారీ కార్రవాయి జర్పటంకాగలదు. అట్టిఖర్చులు నష్టం నీవుభరింపకతప్పదు.

నోటు:— ఈనోటీసు రహబరుదక్కన్ లోగూడ ప్రకట్రింపబడినది. ఇట్లు

బి. హన్మంతరావు దే॥
రాయగీరు, జాగీరు

## స్పెయినులోయుద్ధము

బిల్బో పతనము

బిల్బోకు దక్షిణమున నర్వీనదిగట్టునవున్న 6 గ్రామములనువిద్రోహులసేనలు స్వాధీనపరచుకొనినవి. ఇందువల్లఈప్రాంతమునందున్న4000బాస్కు సైనికులు బిల్బోసేనతోచీలుటయైనది. సాంటాండరు రోడ్డునుస్వాధీనపరచుకొనుటకై విద్రోహులసేనలు యుద్ధమారంభించెను మాడ అను ఇటలీనావ ఆఫ్రికాయందలి ఓరమురేవు చేరగనే రెండు స్పెయిను ప్రభుత్వపు విమానములు ఈ నావ పైబాంబులను వేసి తుపాకిగుండ్లనుప్రేల్చెను. నావయందున్నవారి కెవ్వరికిని ఎట్టిఅపాయముకలుగలేదు. తూర్పుననున్న కొండలను స్వాధీనపరచుకొనుటకై విద్రోహులు యుద్ధము జరిపిరిజూన్ 13 బిల్బో నగరము నందున్న ప్రజలు 70వేలమంది బిల్బోనగరము వదలిసాంటాండరు నగరముచేరుటకు రోడ్డుమీదగపోవు వచ్చునప్పుడు విద్రోహులువీరిపైబాంబులను వేయ పలువురుమరణించిరి. స్టీమరులలోప్రయాణమైన వారలుకూడ విమానములనుండి బాంబులు వేయబడెను 300 మంది స్త్రీలుబాలురతో నిండిన ఒక స్టీమరు మునిగి పోయెను సాంటాండరులోచేరిన యంతమందికి వసతులు ఆహారపదార్థముసమకూర్చుట కష్టమైనది బిల్బోనగరసంరక్షణమునకు ఒక ప్రత్యేక సంఘము నేర్పరచి బాస్కు ప్రభుత్వము నాకు బిల్బోనగరమును వదలివేరొక నగరమునకు వెళ్లిరి. బిల్బోసంరక్షణకై నియమింపబడిన సంఘమున సేవలిష్టుసోషలిష్టు కమ్యూనిష్టు పక్షముల ప్రతినిధులున్నారు

జూను౧౭:—

నర్వీయనునదివద్ద బాస్కు సేనలకు విద్రోహులకు జరిగినయుద్ధములో శత్రుసేనల పురోగమనమును అడ్డగించుటకై బాస్కు సేనికులే నదిమీదనున్న రైల్వేవంతెనను పాడుచేసెను. బాస్కు ప్రభుత్వపు కేంద్రస్థానము బిల్బోనగరమునుండి ట్రూపియన్సుఅను ఒక చిన్న గ్రామమునకు మార్చబడెను.

### మాడ్రిడు ప్రభుత్వముపై సైనికోద్యోగుల కుట్ర

మాడ్రిడునగరమందలి స్పెయిను ప్రభుత్వమును పడగొట్టి, తిరుగుబాటుదారులకు సహాయమొనర్చుకొనుటకును జరుగుచున్న పెద్దకుట్ర మాడ్రిడులో బయల్పడెను. ఫ్రాంకోసేనాని యేజెంటులీకుట్రకు మూల పురుషులు. అట్లు ౨౦౦మందికుట్రదారులు అరెస్టుచేయబడిరి. అందు ప్రభుత్వ సైనికోద్యోగులలో ముఖ్యులగు వారుగూడ కొందరుగలరు. వీరందరును తమ నేరము నొప్పుకొనిరి.

కుట్రదారులు, మాడ్రిడునందలి దక్షిణ అమెరికా ప్రభుత్వ రాయబారి కార్యస్థానము వాసమేర్పరచుకొని రేడియో యంత్రముద్వారా ప్రభుత్వ రహస్యములను ఎప్పటికప్పుడు విద్రోహుల ప్రధానకార్యస్థానమునకు పంపుచుండిరి. మంచితరుణముచూచి, మాడ్రిడుప్రభుత్వముపై తిరుగుబాటు లేవదీయుటకుగాను ౪౦౦మందికి ఆయుధోపయోగశిక్షణమొసగిరి.

వాలెన్షియాలో సుమారు ౧౦౦ ఇటాలియ జర్మనువిమానములు దినమంతయు నిరంతరాయముగ బాస్కుప్రభుత్వసైనికులపై నెగురుచు బాంబులు అగ్ని గోళములు విసరెను.

౧౯ జూను

విద్రోహులసేనలు బిల్బోనగరమును ప్రవేశించెను.

ఉదయమగుసరికి విద్రోహుల వారలసేనలు నర్వీయనునదిదాటి బిల్బోనగరము ప్రవేశించెను.

తిరుగుబాటుదారులు నగరముప్రవేశించగానే బాస్కుసైనికులు యుద్ధప్రయత్నములను మానుకొని ఎచ్చటివారచ్చట పరుగిడిరి. నగరమంతయు గందరగోళపు స్థితియందుండెను.

---

వినోదరత్నాకర నటక చింతారత్నాద్యనేక బిరుదాంకితులును
గుబ్బి శ్రీ చెన్నబసవేశ్వరస్వామి థియేట్రికల్
కంపెనీ యజమానులునగు

## జి. హెచ్. వీరన్న గారు

శ్రీయుత వీరన్నగారిజీవితముపై ఒకపర్యాయము దృష్టిసారించినచో ఎంతయు ఆశ్చర్యమునుగొల్పును. వీరు ఏడేండ్లప్రాయులై యుండగనే నాటకరంగమున ప్రవేశించి యిప్పటివరకును నాట్యకళోపాసకులై ప్రఖ్యాతిగాంచినారు. ప్రథమమున చిల్లర వేషములను, తరువాత స్త్రీవేషములను ధరించి వీరు ప్రజాదరణపాత్రులైరి. ఇంతలో యజమానులగు చందన్నగారు స్త్రీపాత్రలు స్త్రీలేధరించుట యుక్తమనితలచుటచే వీరన్నగారు యితరపాత్రలనుధరించవలసివచ్చెను—దీనికితోడు వీరి కంఠమాధుర్యము గూడ చెడిపోయెను. మరియొక నటకుడైనచో యిట్టిసమయమున నిరుత్సాహమునుచెంది నాటకరంగమున మరల యడుగిడెడివారుకారు. కాని వీరన్నగారు నిరుత్సాహపడక కంఠమార్దవ మనవసరమైనపాత్రలనే ధరింపతలచి, మానవస్వభావములను జాగ్రత్తగాపరిశీలించుచు వాటిననుసరించుటయందు కృతార్థులై క్రమేణహాస్యరసప్రదర్శనమునందు ప్రవీణతగాంచి యజమానియగు చందన్నగారి యొ సమానాదరణకు పాత్రులైరి.

సాదరంఆను కన్నడనాటకమునందు దొంగవానివేషమును ధరించుటయందు వీరికి మించినవారులేరు. ఇప్పటికిని వారిముఖ్యపాత్రలలో యిదియొకటియని చెప్పెదరు.

తదుపరి చందన్నగారు కాలధర్మమునందిరి. వీరికుమార్తు మైనరైనందున, గార్డియన్,కంపెనీనటకులకు అమ్మివేసెను. అంతఃకలహముచే కంపెనీ తుదకు వీరన్నగారికిని, నగరాజప్పయను మరియొకరికిని చెందగా నగరాజప్పగారు తమ సగభాగమునుగూడ వీరన్నగారికే విక్రయించెను. అప్పటినుండి వీరన్నగారు యీకంపెనీయొక్క అభివృద్ధికికారణమై ప్రఖ్యాతిగాంచిరి. చందాలవల్ల ప్రోగుచేయబడిన రు ౨౦౦/-పెట్టుబడితో ఆరంభింపబడి నేటికి లక్షలకొలది విలువయైనస్థిరాస్తిగలిగిన యీకంపెనీయొక్క అభివృద్ధికి శ్రీయుత వీరన్నగారే ప్రబలకారణము.

౧౯౨౧ సంవత్సరములో బెంగుళూరునందు నాటకప్రదర్శనము జరిగినప్పుడు, అచట్టి నివాసులు వీరన్నగారి కళాకౌశలమునకుమెచ్చి వీరికి "వినోదరత్నాకర" యను బిరుదమునిచ్చి సత్కరించిరి. ౧౯౨౬సంవత్సరమున ఘనతవహించిన మైసూరుమహారాజాగారువీరిప్రఖ్యాతినివిని, తమసమక్షమున పెక్కు నాటకములు ప్రదర్శింపజేసికొని, యీ కంపెనీకి వారిపోషకత్వము ప్రసాదించుటయేగాక, వీరన్న గారికి "Versatile comedian" అను బిరుదమును ప్రసాదించిరి. ఇప్పటికిని ఈకంపెని మైసూరు మహారాజాగారి పోషకత్వముననే యున్నది.

## బీహారు మధ్యరాష్ట్రకాం గ్రెసునాయకులకు గవర్నర్ల ప్రత్యుత్తరములు

పాట్నా: జూన్ ౧౭

గవర్నరుగారి కార్యదర్శిగారు, మధ్యరాష్ట్రములశాసనసభ కాంగ్రెసుపక్షనాయకునికి ఇట్లు జవాబుపంపిరి. “శాసనసభలో సంఖ్యాబలము కలవారు రాజ్యాంగమున తమబాధ్యతను నిర్వహింపనిరాకరించినప్పుడే గవర్నరుగారు ఈ మంత్రులను నిర్వహింపవలసివచ్చెనని మీరెరుంగుదురు. ప్రస్తుతము మంత్రులబలపరచువారిసంఖ్య సభలో అల్పమని మొదటినుండియు అందరెరింగినదే. మంత్రివర్గ మేర్పడినతర్వాత ఇంతకాలమైనను వారిపై అవిశ్వాసతీర్మానము పంపబడలేదు. సంఖ్యాబలముగలపక్షమువారు యిప్పుడు పునరాలోచనపై ప్రస్తుతమంత్రులు మంత్రిపదవుల విడిచిపెట్టవలెననితమకభిలషించుచున్నటుల భావించుచున్నారు. “అట్లుభావించుట సరియగునా, సరియగుచో మంత్రిపదవీస్వీకారము గూర్చి చర్చింప మీకుయెప్పుడైనసదవకాశమిచ్చుటకుతనకభ్యంతరము లేదని గవర్నరుగారు తెలుపగోరిరి.”

* * * *

పాట్నా జూను ౧౭

“అసెంబ్లీసమావేశపరచవలసిన తేదీనిర్ణయించుటనుగూర్చిగవర్నరుగారాలోచించుచున్నారు, మీరుపంపినవిన్నపమునుగూడ యీసందర్భమునయోచించుచున్నారు.” అని బీహారుగవర్నరుకార్యదర్శి బీహారుశాసనసభ కాంగ్రెసుపక్షకార్యదర్శికి జవాబువ్రాసిరి. ప్రస్తుతమంత్రివర్గమునందు విశ్వాసము లేదనితీర్మానించుటకు శాసనసభను సమావేశపరుచవలసినదిగా గోరుచు ౭౧ మందిసభ్యుల సంతకములు చేసిన లేఖను గవర్నరుయొద్దకుపంపియుండిరి. దానికిదిజవాబు.

## దక్షిణాఫ్రికాలో భారతీయులపొలముల నాక్రమించు ఎత్తు

అఖిలభారత కాంగ్రెసుసంఘము విదేశీశాఖవారు ఈదిగువరీతిని ప్రకటించుచున్నారు:-

దక్షిణాఫ్రికా యూనియను పార్లమెంటులో భూములశాఖమంత్రి ఒక క్రొత్తచట్టమును ప్రవేశపెట్టుచున్నారు- నేటాలు ఇండియనుచెరకురైతులసంఘమువారుపంపినవార్తప్రకారము యీచట్టములో ముఖ్యాంశమేమన, న్యాయకరము లేనటువంటివిగాని, భూస్వాములు ఉన్నతతరగతిజీవితముగడపుటకు తగినరాబడి నీయజాలని వని మంత్రిగారికితోచునటువంటి పొలములను మూడునెలలునోటీసుయిచ్చి మంత్రిగారు భుక్తపరచుకొనునట్టి అధికారమొసంగబడెను-

“భారతీయులు బహిరంగసభచేసి: చట్టము నందులాభకరముగులాబడి అనగానేమో రుజువుచేయనందునను, ఉన్నతజీవితవిధాన మెట్టిదో, నిర్వచింపనందునను. యీచట్టము కేవలము భారతీయులకు ప్రతికూలముగ ఉద్యోగులు నిరంకుశముగ ప్రవర్తించుటకు అవకాశమిచ్చుచున్నదగుటచే, చాలప్రమాదకరముగునదనియు దీని ఫలితముగా భారతీయులు నాశనమగుదురనియు కావున దీనినిమంత్రిగారు ఉపసంహరించుకొనవలెననియు తీర్మానించిరి.

### వయోజనవిద్యావ్యాప్తికై ప్రభుత్వము వారియత్నములు

కలకత్తా, జూన్ ౧౭

వయోజనవిద్యావ్యాప్తికి తగినస్కీముచేయుటకై ప్రభుత్వమువారు ఒకకమిటీ నేర్పరచిరని యునైటెడ్ ప్రెస్సువారికి తెలియుచున్నది-

ఈకమిటీపేరు అడల్టు ఎడ్యుకేషను కమిటీ- ఈకమిటీకి అధ్యక్షుడు విద్యాశాఖాధికారి-

## ముసల్మానులను కాంగ్రెసులో చేర్చు ఉద్యమము

డాక్టరుఅలంగారిమాననష్టపుదావా

లాహోరు, జూన్ ౧౭

కాంగ్రెసుప్రధానకార్యాలయమువారు ముసల్మానులను కాంగ్రెసులో చేర్చుటకు లక్షలరూప్యములు డా- అలము గారికిచ్చెదరనియు; ఉర్దూ దైనికపత్రిక నుస్థాపించుటకు కొంతసొత్తును డా- మహమూదు అలంగారికీయనున్నారని మే ౧౭వతేదిని సివిలుమిలటరీ గెజటుపత్రికలో ప్రకటించి తనకు మాననష్టమును కలుగజేసిరని అపత్రికాసిబ్బందిమీదను సంపాదకునిమీదను యూనియనిస్టుపక్ష ప్రధానకార్యదర్శిపైనను డా- అలంగారులాహోరుజిల్లా మేజస్ట్రేటుకోర్టులో మాననష్టపుదావాను తెచ్చిరి మరియు యీఅభియోగమును ఇంకొకరాష్ట్రమునకు విచారణనిమిత్తము మార్చవలెనని సభాయుక్తమైన గవర్నరు జనరలును కోరెదరనియు డా- అలంగారు జిల్లామేజస్ట్రేటునకు తెలియజేసెను-

### ౨౦ మందిసభ్యులకు పంజాబు కాంగ్రెసుసంఘము విధించినశిక్షలు

పంజాబు కాంగ్రెసు కార్యకారిణీసంఘము వారు సుమారు ౨౦ మంది పైచర్యగైకొనిరి. వీరు కాంగ్రెసునిలపిన అభ్యర్థులకు విరుద్ధముగ ఎన్నికలందు పనిచేయుచుండిరి- ౧౫ మంది కాంగ్రెసుసభ్యత్వమునుండి, వేరొక కార్యకారిణీసంఘసభ్యత్వమునుండియు ఓకరియేడా దివరకు తొలగింపబడిరి. మరిముగ్గురు హెచ్చరికతో విడువబడిరి. ఈచర్యగైకొనుటకు అ.భా.కాం. సంఘము వారిఅనుమతినిడసిరి. దూనిచందుకమిటీనివేదికననుసరించి యీచర్యగైకొనబడెను,

## షరతులేకుండ మంత్రిపదవులు స్వీకరించవలెను

ఎస. ఎన్. రాయిగారి క్రొత్తవాదము

అలహాబాదు జూన్ ౧౭

పేరుకుమాత్రము హామీకోరుట ప్రయోజనములేదు కావున హామీలకైపట్టుబట్టక, కాంగ్రెసుపక్షనాయకులు యికముందు గవర్నరులచే ఆహ్వానింపబడినచో మంత్రిపదవులను స్వీకరింపవలెననుతీర్మానమును సంయుక్తరాష్ట్రముల కాంగ్రెసుసంఘకార్యవర్గమునందు ప్రతిపాదించుటకు ఎం.ఎన్. రాయిగారు నోటీసుపంపిరి. జెట్లండుప్రభువుగారి తుదిఉపన్యాసములో కాంగ్రెసువారుకోరినహామీయొసంగుట ఘటనాపూరువతీర్మానము ఉపసంహరించు కొనవంతవరకు వీలులేదని స్పష్టపరచబడినదనియు, అందుచే హామీకోరినచో కాంగ్రెసువారికి ఇప్పటిలో ఇష్టముకాని రాజ్యాంగప్రతిష్టంభన మేర్పడుననియు, ఢిల్లీతీర్మానముప్రకారము కోరబడిన హామీగవర్నరులును, ఇండియామంత్రియు యిచ్చినట్లే ఎంచవచ్చుననియు, కావున కాంగ్రెసు ఫయిజుపూరుతీర్మానమును ఢిల్లీతీర్మానమును అమలుజరుపుటకై యిపుడు మంత్రిపదవులను స్వీకరించవలెననియు రాయిగారివాదము.

మొట్టమొదట రాయిగారుమంత్రిపదవులను స్వీకరించరాదనెడివారు. అట్టివారిలో ఈక్రొత్తమార్పునకుకారణము వారికి యిష్టమైన రాజ్యాంగప్రతిష్టంభనను కాంగ్రెసులో పలువురకుయిష్టముకానట్లు వారికితోచి విసుగుజనించుటయే.

### పంజాబు ఖైదీలవిడుదల

సిమ్లా జూన్ ౧౭

౧౯౧౫ సంవత్సరపు సైనికశాసనముప్రకారము నిర్బంధితులైన ఖైదీలను విడుదలచేయుటకు పంజాబుముఖ్యమంత్రి సర్ సికిందర్ హయతుఖాన్ గారు ఉత్తరవులుపంపినట్లు అసోసియేటెడుప్రెసువారికి తెలియుచున్నది-

## అమృతసరులో శిక్కు- మహమ్మదీయుల కొట్లాట

అమృతసరు, జూన్ ౧౫

గుజరాతు జిల్లాయందు అల్లాగ్రామమున హిందూముస్లింకొట్లాటయందు చంపబడిన సుందరసింగుశవము యీపూరుతెచ్చి ఊరేగింపుతో స్మశానమునకుగొంపోవుచుండ ఒమ్మనాలుబజారువద్ద ఉదయం ౧౦ గంటలకు ఒక మహమ్మదీయవర్తకునికి ఉత్సవములోనివారికి ఘర్షణజరిగెను- ఒకమసీదునుండి ఉత్సవముపై రాళ్లువేయ బడెననియు. దానితో కొట్లాట ప్రారంభింపబడినదనియు అనుకున్నారు. సుమారు ఆర్గురుగాయపడిరి- ఉత్సవములో పోలీసు అధికారులుండిరి-

తరువాత సిక్కులు దహనాంతరము తిరిగివచ్చినపుడు మకానములపైనుండి యొక్క మహమ్మదీయులను కొట్టిరని తెలుపబడుచున్నది- చాలమందిగాయపడిరి-ఒకపోలీసు రౌతురాగా శిక్కులు వెడలిపోయిరి-

మొత్తముగాయపడినవారు ౩౨-అంచెక్కువమందితురకలు-

బ్రిటిషుసేనను తెప్పించి ముఖ్యస్థలములందు కాపలాయుంచిరి- పోలీసు ఉద్యోగులందరు కాపలాతిరుగుచున్నారు- ౧౨౪ సెక్షను ఉత్తరువులోనంగి ఐదుగురికిపైగా ఒకచోచేరరాదనియు, దౌర్జన్యమునకుగడంగువారు, ఇండ్లుతగులబెట్టువారుఅగుపడగనే తుపాకితోకాల్చి చంపబడుదురనియు, అసత్యవార్తల వ్యాపింపచేయువారు అరెస్టుచేయబడుదురనియు హెచ్చరికలు ప్రకటించబడినవి-

లాహోరు, జూన్ ౧౫

అమృతసరులో కొట్లాటజరిగినందున, లాహోరుగూడ వ్యాపించునేమో యనుభయముచే పోలీసువారు చాలశ్రద్ధవహించుచు ముఖ్యముగు చోట్ల కాపలాయుంచిరి-

## సరిహద్దు పరిస్థితులు

"సరిహద్దురాష్ట్ర పరిస్థితులు" అను శీర్షికక్రింద స్టేట్సుమన్ పత్రిక ఈక్రింది సంపాదకీయవ్యాసమును వ్రాసెను:—

ఈసం॥ ప్రారంభమున ఉన్నబలముకంటె ప్రస్తుతము వజీరుస్థానమున భారతప్రభుత్వమునకు ఎక్కువబలమున్నదని స్పష్టమగుచున్నది గత ౭ వారముల యుద్ధము ఫలితముగా వజీరుస్థానములోని కొండజాతులలో ఒకవిధమైన మార్పు కలిగినది. సరిహద్దురాష్ట్రమునందున్న కొండజాతులవారినందరిని లొంగదీయవలెననిన ఎక్కువవ్యయమునష్టము కలుగకుండా సాధ్యపడదు. కొండజాతులలో కొందరిని లొంగదీయుటకు ప్రయత్నించుటవలన క్రిందటి శరదృతువునుండి చిక్కులు వచ్చుచున్నవి. కోట్లనుచెడగొట్టుట, సైనికులతో అక్రమముగా పోరాడుటవలన శాంతిపరిస్థితులేర్పడజాలవు. ప్రభుత్వమువారి శాంతిసన్నాహముసరిగా సాగనిపక్షమున పట్టుదలతో తిరుగుబాటుదారులను అణచివేయవలసియుండును.

## ప్రభుత్వకోపమునకు భయపడము

బొంబాయి కాంగ్రెసు పక్షనాయకుని ఉపన్యాసము

పూనాసారు, జూను ౧౪

ఇచట నొక బహిరంగసభయం దుపన్యసించుచు, బొంబాయిశాసనసభ కాంగ్రెసుపక్షనాయకుడగు బి. జి. ఖేరు గారిట్లనుడివిరి:-

మంత్రిపదవులనెడి హోదాలకుగాని, స్వాతంత్ర్యములకుగాని మేము దేవులాడుటలేదు. ప్రభుత్వమువారి కోపమునకుగాని, నిర్బంధచర్యలకుగాని భయపడలేదు. గత మూడునెలలలో రాష్ట్రీయస్వరాజ్యకుమములు జరుగుచున్నదని గవర్నరులనుచున్నారు. అది యొట్టిస్వరాజ్యమో మనమందర మెరుంగుదుము."

ప్రభుత్వమువారు ముందేమిచేయుదురని మనమూహించుటకవకాశము లేదు. వారు శాసనపద్ధతులనురద్దుచేయవలెను. లేదా రాజ్యాంగవిధానమును రద్దుచేయవలెను. రెంటికిని కాంగ్రెసు సిద్ధమేయని ఖేరుగారనుడివిరి.



## కావలెను

తాండూరు (వాడీసమీపమున) లోని ప్రాథమిక, పాఠశాలకు (రెండు), హిందూ ప్రధానోపాధ్యాయిని కావలెను. యోగ్యతనుబట్టి వేతన మీయబడును. వయోవృద్ధులగు పురుషులకుగూడ అవకాశ మీయబడును. దరఖాస్తులు వివరములతో

వడ్లకొండ-నరసింహారావు
బాలికల ఉన్నత పాఠశాల
సుల్తాను బజారు హైదరాబాదుకు వెంటనే పంపవలెను.



## గోలకొండ కథలసంచిక

| | | | |
|---|---|---|---|
| చందాదారులకు | వెల | రు | ౧-౦-౦ |
| ఇతరులకు | " | " | ౨-౦-౦ |

## మత పరివర్తనను గూర్చి రామకృష్ణ పరమహంసగారి అభిప్రాయము

కోకినాడలో జూన్ ౧౫వ తేదిన డాక్టరు జటావల్లభుల పురుషోత్తం, ఎం.ఏ., (కొవ్వూరు గీర్వాణపాఠశాలా ప్రధానోపాధ్యాయులు) గారి యధ్యక్షత క్రింద నిన్న సాయంకాలము ఒక బహిరంగసభ జరిగెను. పురుషోత్తంగారు మాట్లాడుచు ఇప్పటి క్రైస్తవ మిషనరీలు, మౌల్వీలు యితరులను తమమతములలోనికి కలుపుకొనుట దౌర్జన్యమే యగుచున్నదని యిప్పుడు గాంధిమహాత్ముడిటీవల వ్రాసుచున్నట్లే అప్పుడు రామకృష్ణుడు యితరమతములయందలి సత్యము తెలిసికొనకపోవుటయే యీమూర్ఖత్వమునకు కారణమని చెప్పియుండెననిరి.

## జైలు సూపరింటెండెంటుపై ముసల్మానుల ఆక్షేపణ

లాహోరు, జూన్ ౧౧

మహమ్మదీయుల మతగ్రంథమును తృణీకరించిన నేరారోపణకు జైలు సూపరింటెండెంటుగా నున్న ఒకశిక్కును పూంచిరాజా సాహెబ్ గారు సస్పెండు చేసిరని తెలియుచున్నది. ఈ సమాచారము రాజసాహెబుగారివరకు పోకముందు జిల్లామేజస్ట్రేటు, ప్రముఖులు కొందరు సమాధానపరుప ప్రయత్నించిరికాని లాభము లేకపోయెను. ముస్లింఖైదీలు నిరశనదీక్షను గడిగిరి. ముస్లింప్రముఖులు కొందరు దీనివిషయమై రాజాసాహెబ్‌కు రిపోర్టుచేసిరి, రాజాసాహెబు సూపరింటెండెంటును సస్పెండు చేసి విచారణసంఘమును నియమించిరి. ముస్లిం ఖైదీలు నిరశనదీక్షను మానిరి జైలు సూపరింటెండెంటును సస్పెండు చేసినందున, హిందువులలో ఆందోళన చెలరేగుచున్నది.

## క్రొత్త రాజకీయపక్షము— తాత్కాలిక మంత్రులయెత్తు

ఉదకమండలము: జూన్ ౧౭

ఆలిండియా కాన్‌స్టిట్యూషనలు పార్టీ స్థాపించుటను గూర్చి అభివృద్ధిశాఖామంత్రి ఎం.వి. రాజాగారితో ప్రసంగించగా, సిమ్లాలో నడు మంతరపుమంత్రులు పశువృద్ధిసభకు సమావేశమయినపుడు యీవిషయము ఆలోచింపబడెననిరి. రాజ్యాంగవిధానము ను అనుసరించుట కుద్దేశించువారందరిని ఒకచోటగా చేర్చి ఆపార్టీని స్థాపించవలసినదని అందరికి కలిగెను. ఈరాష్ట్రమునందలి వివిధసంఘములసభ్యులతో తాను సంప్రదింపగా వారందరు అనుకూలముగానుండిరని వారనిరి. అంధ్ర

## గ్రామములకు పరిశుద్ధనీరు

ఉదకమండలం, జూన్ ౧౮

నేడు ఇచ్చట సెక్రటేరియటులో ఆరోగ్యవిద్యాశాఖలమంత్రియగు ఆర్.యం. పాలటుగారి అధ్యక్షతక్రింద "గ్రామములలో పరిశుద్ధమగు నీటిని సమకూర్చుటను గూర్చి ఆలోచించుటకు సభజరిగినది "గ్రామములలో బోరుహోలు బావులను త్రవ్వించినయెడల పరిశుద్ధమగు నీరు ప్రజలకులభించును. దీనికి కావలసినధనమునంతను దొరతనమువారే ఇయ్యవలెను. ఇందుకు స్పెషలుఫండును యేర్పరుపవలెను. ఇందులకు కావలసినధనమును దొరతనమువారు ఒదులువుచ్చుకొనవలెను. మదరాసు ప్రెసిడెన్సీలో నున్న ప్రతిగ్రామములోను యీరకమునూతుల నుయేర్పరచుటకు కొన్నియేండ్లుపట్టును. ఇందులకు మూడుకోట్లరూపాయలవ్యయమగును." అని సభవారునిశ్చయించిరి. ముందుగా అయిదారులక్షరూపాయలతో పని ప్రారంభింపబడునని తెలిపినది.

(ఆంధ్ర)

## జెరూసెలంలో మరల అరబ్బుల తిరుగుబాటు

జెరూసలెం, జూన్ ౧౩

నేటిదినము పాలెస్టైయిను పోలీసు ఇన్స్పెక్టరు జనరలు రాయిస్పైసరుగారు జెరూసలెం నగరవీధులలో మోటారులోపోవుచుండ ముగ్గురు అరబులు వారిబండిపై పిస్తోళ్ళు ప్రేల్చిరి. మోటారుబండినినడుపుచున్న బ్రిటిషు కానిస్టేబులుమిల్నరుగారికి మెడమీద ఎడమరొమ్ము ప్రక్కగను గాయములు తగిలినవి- స్పైసరుగారు బండినుండిదుమికి పిస్తోలు ప్రేల్చుచున్నవారిని పట్టుకొనప్రయత్నించిరిగాని వారు సందులలో దూరిపారిపోయిరి-

## స్త్రీ కూలీలసమ్మె

కలకత్తా: జూను ౧౮

బెర్హేవర్ జనపనారమిల్లులలోని స్త్రీ పనివాండ్రు నేడుసమ్మెకట్టినందున మిల్లులనుమూసివేయవలసివచ్చినది: పనివాండ్రసంఖ్యను ఎక్కువచేయవలెనని పనివాండ్రుకోరిరని తెలియుచున్నది. దీనిఫలితము తెలియలేదు వంగరాష్ట్రమున జనపనారమిల్లుల చరిత్రలో స్త్రీ పనివాండ్రు సమ్మెకట్టినందున మిల్లులు మూయవలసివచ్చుటకిదే ప్రథమము.





The best medium for reaching 7 million Andhras of the State Advertise in Golconda Patrika

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the leading Telugu Newspaper of H.E.H. The Nizam's Dominions.

వర్తకులకు

నిజాంరాష్ట్రపు ఎనిమిది జిల్లాలలోని ఆంధ్రులలో మీ వర్తకవృద్ధికి సాధనము? గోలకొండ పత్రికలో ప్రకటనము

Vol. 12. | Thursday 24—6—1937 | No. 14

## ఆంధ్రు రాజుపై అపనింద

లండన్ పత్రిక క్షమాపణకోరుట

"సంస్థానములోని స్త్రీలు బక్కపలచగా ఉండువటుల రాజాగారు చేయుట" అను శీర్షిక క్రింద ౩-౬-౧౯౩౭ తేదిసంచికలో ఆంధ్రు రాజాసాహెబ్‌గారిపై అపనిందను ప్రచురించినందుకు లండన్‌లోని సండే డెయిలీపత్రిక క్షమాపణకోరి నష్టపరిహారముగా రాజాసాహెబ్‌గారికి పౌ. ౨,౦౦౦ యొసంగిరి.

వ్యాసమున ఈక్రింది విధముగా గలదు:— "ఆరాజాసాహెబు సంస్థానమందున్న స్త్రీలకు సూర్యనమస్కారములను క్రొత్త వ్యాయామమును ఆచరణయందుంచిరి వ్యాయామమును చేయుచున్నవారినే రాజావారు తమఅంతఃపురమున చేర్చుకొనుచుండిరని వదంతిగానున్నది.

## వినాయకరావు సవర్కారుగారికి సన్మానపత్రము

పూనా, జూన్ ౧౮

దొరతనమువారెట్టి షరతులును లేకుండ విడుదలచేసిన సవర్కారుగారు ఈనెలకడపటివారమున పూనావచ్చెదరు అప్పుడువారికి సన్మానపత్రమును సమర్పింపవలెనను తీర్మానము నేడు సాయంకాలమునజరిగిన మ్యునిసిపలుసంఘుసభలో నామోదింపబడెను.

ఇదివరకే స్థానిక మ్యునిసిపలుసంఘాధ్యక్షుని అధ్యక్షతక్రింద ఒకసన్మానసంఘము నేర్పరచిరి.

## దర్బారుకు దోవతితో రావచ్చునా యని మంత్రి గవర్నరు నడుగుట

కలకత్తా: జూను ౧౮.

గవర్నరుదర్బారు మున్నగు ప్రభుత్వసమావేశములకు రాగోరువారు దోవతులుకట్టుకొనిరావచ్చునా?అని నిన్న నుజరిగిన మంత్రుల సభలో ఆర్థికమంత్రి సర్కారుగారడిగిరి, దోవతినికట్టుకొన్నపుడు వారు క్రమవేషములను ధరించెదరో స్పష్టముగా నాకు తెలిపినచో నేనుఆలోచించెదనుఅని గవర్నరు తెలుపుచు దుస్తులు మర్యాదకు భంగకరముగానుండనిచో అంగీకరింతుననెను

## కెమాలుగారిఆస్తి దేశార్పణమగుట

అంకారా, జూన్ ౧౩

టర్కీఅధ్యక్షుడగు కెమాలుగారు గొప్పవిలువగల తనభూములను ప్రభుత్వమునకు ఇచ్చివేయతీర్మానించుకొనితమనిర్ణయమును టర్కీపార్లమెంటువారికి తెలిపిరి—కెమాలు అటతుర్కుగారి ఔదార్యమునకు కృతజ్ఞతతెలుపుచు కెమాలుగారు టర్కీకి తండ్రివంటివారని ప్రశంసించుచు పార్లమెంటువారొకతీర్మానము గావించిరి—

## రష్యాప్రభుత్వముపై కుట్ర

మాస్కో, జూన్ ౧౩

రష్యాసంరక్షణశాఖమంత్రి వార్షిలాపుగారీ క్రిందిప్రకటన గావించిరి.

సైనికాధికారులలో కొందరు కమ్యూనిస్టుపక్షపు నాయకులును, ఉన్నత ప్రభుత్వోద్యోగులను చంపుటకై కుట్రసలిపిరి. ఈకుట్రయందు జోక్యమున్న ౮ మంది సైనికోద్యోగులను గూఢచారులు అరెస్టుచేసిరి. సోవియట్టుప్రభుత్వపు యుద్ధసంఘమువారు ఈనెల ౧ మొదలు ౪ వతేదివరకు ఈవిషయమై విచారణసలిపి నిర్బంధింపబడినవారు దోషులని నిర్ణయించిరి. రష్యాలో ఫాసిస్టు రాజ్యమును స్థాపింపవలయుననుఉద్దేశముతో వీరు కుట్రసలిపిరి ప్రభుత్వరహస్యములను జపాను, జర్మనీదేశములకు విక్రయించిరి. రష్యాతో ఇతరరాజ్యములు యుద్ధమునకుగడంగుటకై కొంతకృషిసలిపిరి. ఈయుద్ధముప్రారంభమైనచో సమయము దొరికినప్పుడు తమసేనలతో ఎదురుతిరిగి ప్రభుత్వమును తమస్వాధీనపరచుకొనవలయునని వీరుద్దేశించియుండిరి యుక్రేనురాష్ట్రమును జర్మనీకి ఇవ్వవలయునని వీరు సంకల్పించుకొనియుండిరి ద్రోహమొనర్చినవారికి తగుశిక్ష విధింపబడినది ఈద్రోహమువల్ల సోవియటుసేనయొక్క ప్రతిష్ఠకు కలిగినకళంకము తొలగునట్లుసోవియటు సైనికులందరుకమ్యూనిస్టుప్రభుత్వముపట్ల సంపూర్ణమగు భక్తివిశ్వాసములను ప్రకటింపవలయునని కోరుచున్నాను.

ద్రోహులైన సైనికాధికారులకు మరణదండనవిధించుటను ఆమోదించుచు దేశమందంతటను సభలు జరుపబడెననియు తీర్మానములు గావింపబడి మాస్కోకు పంపబడెననియు వార్తవచ్చినది—

## యుద్ధమునకై బ్రిటనులో క్రొత్తపన్ను

లండన్ జూన్ ౧౮ —

బ్రిటనుసంరక్షణవ్యయములకుగాను కంపెనీలలాభముపై పన్నువిధింప నెవిలు ఛెంబర్లినుగారు తీర్మానించుకొనినపుడుదానివనూలువిధానమును పలువురుఆక్షేపించియుండుటచే ప్రభుత్వమువారుమార్చిన క్రొత్తసూచనలను ఆర్థికసభ్యుడగు సర్ జాన్ సైమనుగారు నేటిదినముప్రకటన గావించిరి.

౧౯౩౭సంవత్సరము ఏప్రెలు ౧వతేది నుండి ౫సంవత్సరముల కాలము ఈపన్ను అమలునందుండును—సంరక్షణవ్యయమునకై ౫ సంవత్సరములవరకు అప్పుచెయుటకు ప్రభుత్వమువారికిఅధికారమివ్వబడినది—జాయింటుస్టాకుకంపెనీలాభములపై నూటికి౫చొప్పునను, వ్యక్తులు,సంస్థలు జరుపు వ్యాపారములలాభములపై నూటికి౪చొప్పునను పన్నువిధింపబడును ప్రజోపయోగకరములగుపరిశ్రమలపట్ల ఈచట్టముఅనువర్తింపదు. ఆదాయపుపన్నువలెనే ఈపన్ను వసూలుచేయబడును—౨౦౦౦ పౌనులకన్న ఎక్కువలాభముపై పన్నువిధింపబడును.

ఈపన్నువల్ల ప్రభుత్వమునకు సంవత్సరమునకు ౨౫౦లక్షలపౌనుల ఆదాయము కలుగునని అంచనావేయబడినది—సైమనుగారు సూచించినపద్ధతి అన్నిపక్షములవారికి సంతృప్తిని కలుగచేసినది

## స్పెయినులో యుద్ధము దుర్భేద్యమగు సంరక్షణపుఏర్పాట్లు

లండను, జూన్ ౧౭

బిల్బోనగరముచుట్టు ౭ మైళ్లవిస్తీర్ణముగు ప్రదేశమున బాస్కుప్రభుత్వమువారు సంరక్షణపుఏర్పాటులు గావించియుండిరి, ఈప్రాంతమంతయు కొండలతోనిండియున్నది. ౩ వరుసలు కందకములను ౬ వరుసల ముళ్లతీగెకంచెలను ఏర్పరచియుండిరి. ఈ సంరక్షణపుఏర్పాటులుదుర్భేద్యమైనవని బాస్కుప్రభుత్వమువారు పరిగణించుచుండిరి.

కాని ఏవిధముగనైనను బిల్బోనగరమును స్వాధీనపరచుకొనవలయునని తిరుగుబాటుదారులు దృఢసంకల్పమునుగావించుకొని నగరము తమవశమొనర్చవలయుననియు, అట్లుచేయనిచో గోర్నికానగరమువలెనే పూర్తిగా నిర్మూలింపబడుననియు బాస్కు ప్రభుత్వమువారికి తుదిసందేశముపంపిరి. ఈసందేశమునువారుసరకుచేయనందున ౧౦ వతేది తిరుగుబాటుదారులు బిల్బోదాడిని ప్రారంభించిరి. గాస్టెలకొండలవద్ద శత్రుసేనలనెదిరించి చీకాకుపరచి చెదరగొట్టిరి. దుర్భేద్యమై ఈసంరక్షణపు ఏర్పాటులు శిథిలముకాగానే తిరుగుబాటుదారుల సేనలు ముందుకునడచినవి.

### బిల్బోనగరముపై బాంబులు

తిరుగుబాటుదారులు ౪౦ విమానములతో బిల్బోనగరముమీదను, చుట్టుప్రక్కలనున్న గ్రామములమీదను బాంబులను ఈపాకిసుండ్లను ఎట్టివిరామములేక వేయబడెను.

ఈయుద్ధమున తిరుగుబాటుదారుల సేనయందు పాల్గొనిన ఫిరంగీలనుప్రేల్చువారు దాదాపు అందరు జర్మనీ ఇటలీదేశముల వాలంటీరులని తెలియవచ్చుచున్నది

### ఆరగానురంగమున ప్రభుత్వసేనల విజయము

వలెన్షియా, జూన్ ౧౭

ఆరగానురంగమున ప్రభుత్వసేనలు విజయముగాంచినవనియు, సారగోసప్రక్క నగరములందలి తిరుగుబాటుదారులసేనలు చెదరగొట్టబడినవనియు, తిరుగుబాటుదారులసేనలకు అధికముగ నష్టముకలిగినదనియు వలెన్షియానుండి స్పెయినుప్రభుత్వమువారొక ప్రకటన గావించుచున్నారు.

ఆరగాను రంగమున ప్రభుత్వసేనలు తిరుగుబాటుదారులనెదిరించినవనియు కాని ప్రభుత్వసేనలకు సంపూర్ణవిజయముకలిగినదనువార్త నిరాధారమైనదని తిరుగుబాటుదారు లొకప్రకటనగావించుచున్నారు.

## విండ్సరుప్రభువు అమెరికాకుపోదలచుట

న్యూయార్కు, జూన్ ౨౦—

కాగితపుమిల్లు అధికారి కోటీశ్వరుడు రిచర్డుకేన్ గారి తాలూకు పౌ ౫౦౦,౦౦౦లు విలువగల కేసిల్‌హిల్లు అనుభవనమును కొనుటకు విండ్సరు జాబులువ్రాసెను ఇప్స్విచ్ నగరమునుండి వార్తవచ్చినది.

బహుశః మూడువంతులు విండ్సరుప్రభువు ఇచ్చుటకు రావచ్చునని ఊహించవచ్చును.

## మసీదు నుండి మతగ్రంధములను అపహరించుట

షేక్పురా, జూన ౧౮.

నేడువేకువజామున మహమ్మదీయుడు మసీదునుండి మతగ్రంథములను అపహరించుచుండగా పోలీసువారు అరెస్టుచేసిరి. వీనినిసోదాచేయగా మసీదులో ఖురానుకాగితములను తగులబెట్టురహస్యము వెల్లడిచేయుటకు ఆధారములు కన్పించెను.

## నిమ్నజాతులకు తిరువాన్కూరు సహాయము

తిరువనంతపురము: జూను ౧౪

దక్షిణ, కేంద్ర, ఉత్తర తిరువాన్కూరులోనున్న నిమ్నజాతులస్థితిని వృద్ధిలోనికితీసుకొనిరావలెనను సంకల్పముతో తిరువాన్కూరుప్రభుత్వమువారు స్కీమును తయారుచేయించిరని తెలియుచున్నది ఇండ్లకుస్థలమునిచ్చుట, ఇండ్లనునిర్మించుట, బావులనుత్రవ్వించుట, స్మశానభూములను ఏర్పాటుచేయుట, సహకారసంస్థలనుస్థాపించుట, గృహపరిశ్రమలను ప్రోత్సహించుట మున్నగుపనులను చేయదలచిరి కేంద్రతిరువాన్కూరులో అడ్కూర్ సమీపమున ప్రభుత్వమునకుచెందిన భూములు చాలాగలవు ఈప్రాంతమున నిమ్నజాతులకాలనీ ఏర్పాటుచేయసంకల్పించిరి. ఈస్కీముకు ప్రభుత్వమువారుఆమోదించిన, ఇందులకు అవసరమగు ద్రవ్యసహాయమునకు బడ్జెటులో తావొసంగెదరు నిమ్నజాతులకు ఇప్పటికి ౫ కాలనీలుగలవు.

## స్వర్ణమారుతిదేవాలయము సత్యాగ్రహసంఘము

పూనా, జూన్ ౨౨

స్వర్ణ మారుతిదేవాలయమునకుచెందిన సమస్యలను పరిష్కారముచేయుటకు, అవసరమైనచో సత్యాగ్రహము సాగించుటకు "నారకౌన్సిలు" (ఏడుగురుసభ్యులు) ఏర్పాటుచేసిరి—నేటిరాత్రి ఈసంఘము అభినందించుటకు ఎల్‌బి- భోపట్కర్ గారి అధ్యక్షతనుజరిగిన బహిరంగసభకు ౫౦౦ మంది సత్యాగ్రహులు హాజరైరి- ఈమధ్య సత్యాగ్రహమును ప్రారంభించిన వి-యల్- కరందికర్ గారు సభలో నాలసేపు ఉపన్యసించిరి- తమహక్కులనుకాపాడుకొనుటకు హిందువులు పట్టుదలతో పోట్లాడవలెనని వీరు సభవారిని ప్రోత్సహించిరి-

[అ-ప్రె]

## శ్రీనగరు మిల్లుసమ్మె ముగియుట

అహమదాబాదు జూన్ ౨౨

శ్రీనగరుమిల్లులోని పనివాండ్రు నిన్నసమ్మెకట్టి, మిల్లులోనేయుండిరి. కార్మికసంఘమువారు మిల్లుయజమానులతో సంప్రదించి రాత్రి ౧౨ గంటలకు సమాధానముకుదిర్చిరి అందుచేనేడు పనివాండ్రు మామూలుప్రకారము పనిచేయుచుండిరి.

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda PowerPress, Hyderabad. Editor K. Balakrishna Reddy